# నవలలు

| | | రు. | అ. |
|---|---|---|---|
| భయంకరుడు | 1 భా | 0 | 12 |
| నరేంద్రుడు | 2 భా | 0 | 12 |
| రివాల్వరు | | 0 | 12 |
| శాంతారాం యం. ఏ | | 0 | 12 |
| మిస్. మధురిక | | 0 | 12 |
| సర్కిల్ రంగనాథన్ | | 0 | 12 |
| ఆనందభవనము | | 0 | 12 |
| 13 వ నెంబరుగది | | 0 | 12 |
| వజ్రహారము | | 0 | 12 |
| రమేశబాబు | | 0 | 12 |
| రక్తజ్వాల | 1 భా | 1 | 0 |
| డిటో | 2 భా | 1 | 0 |
| మృత్యుమందిరము | | 0 | 12 |
| చాందనుడు | | 0 | 12 |
| శక్తికుమారి | | 0 | 12 |
| కన్నపుదొంగ | 1 భా | 1 | 0 |
| పగటిచుక్క | 2 భా | 1 | 0 |
| డిటో | 5 భా | 1 | 0 |
| (పైమూడు పుస్తకములు వరుసగ చదివినచో కథస్ఫూర్తియగును) | | | |
| రమాసుందరి | 1 భా | 1 | 0 |
| డిటో | 3 భా | 1 | 0 |
| రక్తవాహిని | | 1 | 0 |
| ఇంద్రజాలము | | | 0 |
| అర్థరాత్రపువింత 3 వాల్యూలు | | 11 | 0 |
| దురాశ | 1 భా | 1 | 0 |

| | | రు. | అ. |
|---|---|---|---|
| దురాశ | 2 భా | 1 | 0 |
| దొంగలనాయకుడు | | 1 | 0 |
| మోహపిశాచము | 1 భా | 0 | 12 |
| డిటో | 2 భా | 0 | 12 |
| కాలసర్పము | 1 భా | 0 | 12 |
| డిటో | 2 భా | 0 | 12 |
| విషహృదయము | 2 భా | 1 | 0 |
| తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రిగారి చారిత్రాత్మక నవలలు | | | |
| జీవనప్రభాతము | | 1 | 0 |
| జీవనసంధ్య | | 1 | 0 |
| రాజద్రోహి | | 1 | 0 |
| వలపులరాణి | | 1 | 0 |
| కొవ్వలి లక్ష్మీనరసింహారావుగారి నవలలు | | | |
| వెయ్యినూట పదహార్లు | | 0 | 6 |
| ఆడపడుచు | | 0 | 6 |
| దాసోహము | | 0 | 6 |
| సానిదాని | | 0 | 6 |
| డార్కు రూమ్ | | 0 | 6 |
| ఏదితప్పు ? | | 0 | 6 |
| కొమ్మదాసరి | | 0 | 6 |
| తప్పనిసరి | | 0 | 6 |
| మళ్ళీపెళ్ళి | | 0 | 6 |
| లక్కీచాన్స్ | | 0 | 6 |
| పెళ్ళెందుకు ? | | 0 | 6 |

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి

# పంజాబుమెయిలు



(నిరూపక నవలారాజము)

గ్రంథకర్త.

దామరాజు వెంకటసుబ్బారావుగారు



పబ్లిషర్సు:

కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

కాపీరైట్ రిజిష్టర్డు ] [ వెల రు 1—0—0

రాజమహేంద్రవరము:
శ్రీ కొండపల్లి ముద్రాక్షరశాలయందు
ముద్రింపబడియె.

# పంజాబు మెయిలు

## మొదటి ప్రకరణము

### "మోహము మొండిది"

రాజరాజనరేంద్ర పరిపాలితపురంబై సారంగధరచరిత్ర కాటపట్టై, అఖండ గౌతమీ తీరంబై, విద్యాధికుల కునికిపట్టై కవిశ్రేష్ఠుల గన్నతల్లియయి, శ్రీయుతంబు లగు రాజనగరంబులలో అగ్రగణ్యమయి, చరిత్రాత్మక స్థానములలో నొకటియై యాంధ్రదేశమున కగ్రసీమయయి, విరాజిల్లుచున్న యీ రాజమహేంద్రవరంబు మన కథాంశమునకు ముఖ్యమైనది. ఆ పురవైభవము వర్ణింప నశక్యము. ఆ వైశాల్యము లేని వీధులు, ఆకాశము నంటి ముద్దిడబోవు చున్నవియో యనునటు లంతస్తులపై నంతస్థులు గలిగి వరుసగ గట్టబడియున్న ఆమేడలు, నిత్యము విరామములేక పోవుచుండెడి మోటారులు, గుర్రపుబండ్లు, లెక్కకు మిక్కుటమగు జనులు మొదలగు పురవిశేషము లసంఖ్యాకములై విరాజిల్లు చున్నవి. హరిప్రసాదు బాబను నతడు యీ పురముననే నివసించు చుండెను. ఇతడు సుమారిరువది సంవత్సరముల వయస్సు

గలవాడు. ప్రభుత్వమువారివద్ద విద్యాశాఖలో అధికారిగా పనిచేసి పింఛను తీసికొనియున్నాడు. ఈయన కడు ధనవంతుడు కాకపోయినను అన్నవస్త్రాదులకు లోపము లేదు. ఆ నగరము నన్నేవీరి కొక స్వగృహము గలదు. ఇత డతి న్యాయవంతుడు. పరోపకారి. ధర్మపరుడు. కాని భార్యమాటకైన నెదురు జెప్పజాలని సాత్వికుడు. దైవమాయ యేమియోగాని కూటికి తగిన కూర దొరకదు, భార్యకు తగిన భర్త దొరకదు, భర్తకు తగిన భార్య దొరకదు. భార్య గయ్యాళి యయిన భర్తసాధువు, భార్య పతివ్రత యయిన భర్త స్త్రీలోలుడు. భర్త యేకపత్నీవ్రతుడయిన భార్య వ్యభిచారి, తరుచు నటుకూడు చుండును. ఆ విధముగనే హరిప్రసాదు బాబుభార్య పరమగయ్యాళి. పెనిమిటి మాటయయినను లెక్కచేయునది కాదు. విద్యాశూన్యురా లగుటచే నతి మూర్ఖురాలు. తా బట్టిన కుందేటికి మూడేకాళ్ళను తరగతిలోని యువతి. వీరికొక కుమార్తె గలదు. ఆమెపేరు కమల. ఆమె యీ నగరము ననే బి. యే. క్లాసు చదువు చుండెను. ఆమె కించుమించుగ యిరువది యయిదు సంవత్సరములు వయస్సుండును. ఉంగర ములవలె జుట్టుకొని నొక్కునొక్కులు బడుచున్న యామె ముంగురులు బర్మాముడివలె జుట్టబడియుండుటచే ముఖమున కతిసొగసు నానగూర్చుచున్నది. పద్మదళములవంటి నేత్రములు గలిగి యుండుటచే పద్మదళనేత్రియని చెప్పినను చెప్పవచ్చును.

అంతపొడుగుగను లేక అంతపొట్టిగనులేక ఆమె సమమగు మొత్తయినయువతి. మెఱుగిడిన పసిండివలె దేహచ్ఛాయగలిగి యున్నది.

ఆంగ్లభాషయందే గాక నాంధ్రభాషయందుకూడ నతి ప్రవీణురాలు. వీరియింటనే ప్రభాకరుడను నొక యువ్వనుడు గలడు. అతనికి చిన్నతనముననే తలిదండ్రులు పోయియుండుట చేత తనకులమువాడై యవుటవలన హరిప్రసాదుబాబు తన యింటనేయుంచి అన్నవస్త్రములిడి విద్యనేర్పించుచుండెను. ప్రభాకరుడు బి. యే పరీక్షయందు తీర్ణుడై యం. బి. బి. యస్. డాక్టరు పరీక్షకు చదువుచుండెను. ఇతని వయస్సు మువ్వది సంవత్సరములకు మించియుండదు. శరీరపరిశ్రమయం దాదితేరినవా డవుటచే అంగసౌష్ఠవము గలిగియుండెను. అతడు స్ఫురద్రూపి, ఆ వడిదిరిగి నల్లనై వెలయుచున్న మీసములు, చేతికిగల బంగారుపట్టితోనున్న రిష్టువాచి, కండ్లకుగల సులోచనములు, తళతళమెరసెడి పొళ్లమర్చబడియున్న యాయుంగరములు, ధరించిన వేష్టుసిల్కు సూటు మొదలగు వస్తుసముదాయములవలన పసిడికి తావి యబ్బినటులు అతనియందమున కవి మరింత వన్నె దెచ్చుచున్నవి. ఇతని విద్యాభ్యాసమునకొఱకు హరిప్రసాదుబాబు తనమేడపైన ప్రత్యేకముగ నొకగది యొసంగెను. ఆగదిప్రక్కనే కమలయొక్క పఠనామందిరము గలదు. అప్పుడప్పు డామె తనకు తెలియనివిషయములను ప్రభాకరునికడ

నేర్చుకొనుచుండెను. ఇద్దరికి నతిమైత్రి. ఒకరియెడ నొకరికి అతి ప్రేమ. ఆప్రేమలో సర్వసామాన్యమగు ప్రేమగాదు. మోహాంకురమిళితమగు ప్రేమ, ఆనందమగు ప్రేమ, అసూయలేని ప్రేమ, అంతఃకలహములేని ప్రేమ, అమూల్య మగు ప్రేమ, అసాధారణమగు ప్రేమయయి యున్నది. కాని దాని నొకరి కొకరు యింక తెలియబుచ్చలేదు. అయినను బిడ్డపుట్టిన పేరు దాగునా! వారి యుభయుల చర్యలయందును, చేష్టలయందును, మాటలయందును, మనోభావములందును సూచింపబడుచునే యుండెను. ఏదో యొక పనిగల్పించుకొని తరుచు యొకరిగదికొకరు వెళ్లుచునే యుందురు. ఒకరితో నొకరు మాటలాడుచునే యుందురు. అందక్కడక్కడ హాస్యములగు మాటలాడుకొనుచు ముఖబింబములు వికసింపజేసి యొకరినొకరు చూచి నవ్వుకొనుచుందురు. ఆ నవ్వులైనను అర్ధములేని నవ్వులుగావు. వట్టి వెక వెక నవ్వులుగావు. అతియొయ్యారమగు నవ్వులు, ఓరచూపులుగల నవ్వులు, అతని భోజనసమయముననే యీమె గూడ ప్రక్కన జేరి భుజించును. భోజనమగుసరి కాతనికి తప్పక తాంబూలమందునటు లతి శ్రద్ధగ జూచును. చదువరులారా! ఎంతనిర్వాయను పరస్పరానురాగముగల ప్రియుల చర్య లెటులుండునో మీరెరుంగరా? లోక మెరుంగదా? కమలతండ్రి హరిప్రసాదుబాబు వీరలమనోభావము లెరుగకపోలేదు గాని

కొన లొచ్చినలత ఆదరవున కెగ్రబ్రాకకపోదనియు కులగొర వములకు లోపములేనివానిని, గుణాఢ్యుని, విద్యావంతుని కుమార్తె మోహించినటులు గ్రహించియుండుటచే తాను కూడ అందులకు సమ్మతించి వారికి వివాహ మొనర్పవలయు నను తలంపుతోడనే యుండెను. కమలాప్రభాకరుల మోహము దినదిన ప్రవర్ధమానమై వృద్ధినొందుచున్నది. ఒకనాడు కమల తాను నోట్సువ్రాసుకొనిన పుస్తకముల దిద్దుమని ప్రభాకరునికి చెప్పెను. అతడవన్నియు తిరుగవేయు చుండెను. అందతని కొక పత్రమగుపడెను. అత డది చేతధరించి రెప్పవాల్పక జూచుచు ఆనందభయ ఆందోళనా సూచకంబగు ముఖముతో చిరునగవు జేర్చి కరంబులు వడంకుచున్నను పత్రము క్రిందవిడువక మనంబున యోచనలపై యోచనలు సల్పుచు లోలోన యిట్లనుకొనుచుండెను. "కమలా" కమల కాదు. సువర్ణకమలా! నిత్యము నీముఖసందర్శనము చేయు చున్న నాకే యీనీఛాయాప్రతిమ దిగ్భ్రమ గలుగజేయు చున్నదికదా? అకస్మాత్తుగా నిను గాని నీఛాయాప్రతిమగాని తిలకించిన మానవునియవస్థ యెటులుండునో చెప్పతరమా? ఈకమల ముంగురులు ఉంగరములవలె తానే జుట్టుకొనుచుండునా? లేక వాటికవియే వయ్యారముగ వంగియుండునా? బ్రహ్మ నాకు ప్రతిసుందరవస్తువునందునను తిల, తిలయె త్తున దీసి యీతిలోత్తమను జేసెనట అట్టి తిలోత్తమల నెంత

మందిని గలిపి యాకములను జేసియుండెనోగదా? సుందరీ ! నీమృదుపాదములకు దగుపాదరక్షలనే ధరించియుంటివిసుమీ. ముఖమలుదయినను నీశరీరమృదుత్వమునకు మోటనుపించు చుండెను.

నీదేహకాంతిముందు ఆజోడుపై గల చమ్కీకాంతి పనికిరాలేదు సుమా? ఈమెకు రూపునకు దగినవిద్య విద్యకు తగిన వినయము, వినయమునకు దగిన సిరి, సర్వము నమరి యున్నదిగదా? కమలా? నేనునీకుతగుదునా? నన్ను పెండ్లాడు దువా? నీ చర్యలు చూడ నా కాశ లంకురించుచున్నవి. కాని యేమో యెవరు చెప్పగలరు. తానొకటి దలచిన దైవమొకటి దలంచును. ఈమె నాకు భార్యయగునో, మరి యే అదృష్ట వంతుడైన కనిబెట్టుకొనియే యుండెనో యెవరికెరుక. ప్రభూ! దీనజనబంధు! సర్వాంతర్యామి! అఖండకోటిబ్రహ్మాండనాయకా దేవా ! ఈశా ! పరమేశా ! కరుణామయా భక్తవత్సలా ఆశ లంతమొందింపజేయకుమా, మొలకెత్తి చిగుర్చుచున్న మోహ లతను ద్రుంచివేయజూడకుమా, నీదయ, నీమనస్సు నీదియే భారము. మాయిద్దరికి దాంపత్య మొకటిజేసితివా నీమేలు మరువను. మహోపకారి వని వేనోళ్ళ జెప్పుకొందును. నిత్యము నీగురించి ప్రజలకు ప్రచురణ జేయుచుందును. అని అను కొనుచుండెను. ఇంతలో కమల వచ్చి ప్రభాకరునిచేతిలో తన

పఠము చూచి సిగ్గుపడి నవ్వుకొని ఆతనినిపిలచి పుస్తకములు దిద్దుట పూర్తిఅయినదా ? యని ప్రశ్నించెను. అత డామెను చూచి నివ్వెరపడి ఆమె చూడకుండ చేతగలపఠము దాచబోయి బల్లపైగల పుస్తకము లన్నిటిని క్రిందద్రోసి తత్తరబడుచు యేదో చెప్పబోవుచుండెను. ఇంతలో హరిప్రసాదు డతి సంభ్రమునవచ్చి సీ బి. యే. పరీక్ష ప్యాసయినదట ఇదుగో గెజిటు 108 వ నంబరు చూడుము. అని పలికి ప్రభాకరుని బిలచి యొకపూలమాల నిచ్చి యది కమలకు బహుమతియు మని పలికెను.

అత డాకమలకంఠమున పూలమాలవేయ ఆమెకు గలిగిన ఆనంద మేమనిచెప్పను. తాను పరీక్షయందు తీర్ణురాలైనందులకేకాదు తన మనోనాధుడు తన ప్రాణప్రియుడు తన కంఠమున పూలమాల వేసినందులకు.

ఈసమయమున కమలతల్లివచ్చి హరిప్రసాదును బిలచి "యేమండీ! బజారునుండివచ్చి కులుకుచు కూరుచున్నారా? కూరలైనను తరుగ కూడదా? వంటవేగము అవునుగదా?

హరి—మూర్ఖురాలు వచ్చినది. పద్మావతీ! దానికేమిగాని మన కమల పరీక్ష ప్యాసయినదినుమీ-

ప—సరియే! ఏమిప్యాసయిన యెందులకు, వంటపొయ్యి దగ్గర కేకదా? ఏమండో చెప్పడం మరచితిని. మన రామ

నాధముగారి కోడలు చనిపోయినదట. చూచి రావ లెను. నేవెళ్ళెదనుగాన యీవాళ వంటమీదే అని పలికి పోయెను.

క—నాన్నగారూ! అమ్మ మాటలు లెక్కచేయకుడు. సర్వము నే సిద్ధపరచెదను. అని బలికిపోయెను.

చదువరులారా! ఇకమనము చేరురంగము అతిమనోహరమయినది. హరిప్రసాదుతోపాటు ప్రభాకరుడు కూడ భోజనమున కరుదెంచెను. సర్వపదార్థములు వడ్డనచేయబడి యున్నవి. తన ప్రియురాలిచేత తయారుకాబడిన పదార్థముల రుచిజూడ ప్రభాకరుని నోరువ్విళ్ళూరుచున్నది. పట్టుపీతాంబరములు ధరించి, తడియారిన కురులు జారుముడివైచి, ముఖమున కుంకుమతిలకము దిద్ది, హస్తమున ఘృతకలశమును బట్టి అన్నపూర్ణావతారమువలె నున్నకమల వడ్డనకు సిద్ధమై నిలిచియున్నది. భోజనములు ప్రారంభమైనవి. ఘృతకలశము నొంచి ప్రభాకరుని హస్తమున నేయివేయుచున్నది గాని యీమెదృష్టి ప్రభాకరుని ముఖకమలముస్రవాల పరుగిడుచు వాని క్రేగంటి చూపుల నెదుర్కొని యున్నది. ఈసందడిలోబడి యీమె వడ్డనమూనదు. అతడు చేయితీయడు. ఘృతప్రవాహము విస్తరినుండిబయలుదేరినది. నీగలచూచి హరిప్రసాదించుక

నవ్వుకొని కుమార్తెను బిలచెను. కొంతసేపటికి భోజనము లయి యెవరిగదులకు వారు జేరిరి.

---

## రెండవ ప్రకరణము

---

### "స్త్రీశవము"

రాజమహేంద్రవరమున గోదావరి యను రయిలు స్టేషన్‌కు వచ్చి వెళ్లెడి రయిలుబండ్లకుగాని, వచ్చి వెళ్లెడి ప్రయాణస్థులకుగాని విధి విరామములేదు. అప్పుడే మద్రాసు మెయిలు వచ్చి చేరినది. అనేకులు ప్రయాణీకులును సామగ్రులు మోయుకూలీలును, కాఫీ, టీ, పండ్లు మొదలగు తినుబండారము లమ్మువారలును, రయిల్వే యుద్యోగులు పోలీసు భటులును మొదలగు జనులచే ప్లాటుఫారము అంతయు కిలకిలలాడుచున్నది. కొంతసేపటికి జనులందఱు యెవరితావులకు వారు చేరిరి. రయిలుబండి గూడ స్థలము వదలి పోయెను. గాని ప్లాటుఫారముపై నెవరిదో యొక ట్రంకుపెట్టె విడువబడి యున్నది. ఆపెట్టె సుమారు 3 అడుగుల పొడవు, ఒక అడుగు వెడల్పు గలిగి యున్నది. ఆకుపచ్చని రంగు వేయబడియున్నది. పెట్టెకు బీగము బిగించి సీలువేయబడి యున్నది. పెట్టె పైన ఎవరి పేరును వ్రాయబడి యుండలేదు. అయినను ఆ

పెట్టెలను విక్రయించువారి పేరుమాత్రము వ్రాయబడియున్నది. లక్కసీలు పైగూడ అక్షరము లేమియు గనబడుచుండుట లేదు. కొంతసేపటి కామందసమును పోలీసుభటులు చూచి యెవరిదో తెలిసికొన నాచుట్టుప్రక్కలగల అందరిని అడిగిరి గాని దాని యజమాని దొరకలేదు. పిదప వారాశ్చర్యము నొంది రయిల్వే అధికారులకును పోలీసు అధికారులకును ఈ సమాచార మెరింగించిరి. ఆయాయధికారు లందఱువచ్చి పెట్టెను పోలీసుఠాణాకు తీసికొనిపోయి కొందరు తగుమనుష్యులును, పోలీసు, రయిల్వే అధికారులును దగ్గరవుండి ఆపెట్టెను తెరచిరి. ఘోరము. మహాఘోరము. ఎందువలననో యెరింగితిరా ? చదువరులారా ! అందొక స్త్రీశవముగలదు. పోలీసు మొదలగువా రాశ్చర్యమానసులై ఆశవమును పైకితీయించిరి. ఆశవమునకు యెక్కడను రక్తపుమరకలుగాని కత్తివ్రేటులుగాని లేవు. అచ్చట పోలీసువారు, వారిపై అధికారులగు సూపరింటెండెంటు మొదలగు వారలకును సిటీసర్జనునకును వార్త లంపిరి. రయిల్వే అధికారులగు డి. టి. యస్. మొదలగు వారలకు గూడ యీవార్త తెలుపుడు జేయబడినది. తృటికాలములో అధికారులందఱు చలనహేతు శకటములపై నచ్చటకు వచ్చిచేరిరి. తక్షణమే ఆశవమునకు యొక ఛాయాప్రతిమ దీయించిరి. సర్జను యీశవమును చికిత్సాలయము నకు దీసుకొని రావలసినదని చెప్పిరి. ఆశవ మెవరిదో

యొవరును తెలిసికొనలేదు. దానికి కట్టబడియున్న చీరయు రవికయు తెల్లనివి. వాటిపయిని నెవరిపేరును లేదు. కాని నక్ష త్రమువలె జీడితో గురుతు వేయబడి యున్నది. ఆశవమునకు చెవులకు దుద్దులును ముక్కునకు ముక్కుపుడకలు నున్నవి. వాటినమర్చబడియున్న రాళ్లు చాలా ఖరీదు అగు వాటివలె నున్నవి. మెడలో గొలుసు, కాసులపేరు, నానుపట్టెడయుకూడ నున్నవి. మొల నొడ్డాణముగలదు. చేతులకు బంగారు గాజులు గలవు. కాళ్ళకు వెండిపట్టీలు గలవు. పోలీసువారు యివియన్ని యు శవమునందే యుండుటచే హంతకుడు దొంగ కాడని నిశ్చయించిరి. ఈ నగలన్నియు దీసి వరుసవారీగా లిస్టు వ్రాసి పంచాయితీ దారుల సంతకము చేయించిరి. పెట్టెలో అడుగున ఒక దుప్పటి యున్నది. దానిపైన నల్లజీడిగురుతు మాత్రము చంద్రవంకవలె నున్నది. అది ఎవరిదో తెలిసికొనుటకు పోలీసు వారు జాగ్రత్తపరచిరి. ఇంకను పెట్టెలో నేమి యున్నదో చూడుమని రక్షకభటాధిపుడు చెప్పగానే భటులు వెదకిరి. అందొక యుత్తరము దొరకినది. అందిట్లు వ్రాయబడియున్నది. రక్షకభటాధిపులారా !

ఈశవముంచబడిన మందసము తిన్నగా మీఠాణాకు గాని మీయింటికిగాని పంపుటయో లేక స్వయముగ మీకే యప్పగించుటయో చేయదలంచితిని గాని నాసాహసమున

కడలిపోవుదురనియు నెటులయినను మీకందుటయే కావల
సినదనియు యోచించి యిటుల జేసితిని. నే నగలన్నియు
వదలుటచే దొంగను కానని పోల్చియేయుందురు ఇది యీ
మెపై పగతీర్చుకొనుటకు చేసిన సాహసము. నన్ను మీవంటి
దద్దమ్మలందఱు పట్టుకొనజాలరని నాకు తెలియును. నాకొరకు
ప్రయత్నించి అన్యాయముగ మీమీ ప్రాణములు పోగొట్టు
కొనకుడు. నాకు కేవల మిదే వృత్తిగాదు. మీ రూరకొన్న
యెడల నేనిక కూనీలుచేయను. ప్రయత్నించినను మిమ్ము
పుట్టించిన జేజమ్మయయినను నన్ను పట్టుకొనజాలడని నొక్కి-
వక్కాణించుచున్నాను గాన వృథా శ్రమనొందకుడు.

ఇట్లు,

హంతకుడు

పోలీసుశాఖాధ్యక్షుడు అగు మోహనలాలు అనునతడు సిటీయినస్పెక్టరగు ముఖర్జీగారిని పిలిచి "అయ్యా! యీకేసు బహువింతగా యున్నది. ఈహంతకు డతిసాహసునివలె కనబడుచున్నాడు. తొలుతొలుతనే మనల బెదరింప జూచుచుండెను. వీని వెర్రిబెదరింపులకు మనము బెదరమని యెఱుంగదుగావలయును. శవపరీక్షానంతరము డాక్టరురిపోర్టునుబట్టియు ఆమెధరించిన చీరరవికయందును, ఆపెట్టెయందు, దుప్పటియందునుగల గుర్తులనుబట్టియు ఆమె పెట్టెయందుగల పేరునుబట్టియు భోగట్టాలు

తీసి తక్షణము నాకు రిపోర్టుపంపుడు. ఈకేసులో మీరెల్లరు బహుజాగరూకులై వర్తింపవలయును. అవసరమైన యెడల మంచి అపరాధపరిశోధకునిగూడ నియమించెదము శవపరీక్షాంతరమునవచ్చిన డాక్టరురిపోర్టుయొక్క సాంశములన్నియు ఛాయాప్రతిమయు, నగల వివరము, ధరించినబట్టలు, వాటిపై గల గుర్తులు వగయిరా సమాచారములన్నియు ప్రతివార్తాపత్రికకు పంపియు కరపత్రములు ముద్రింపించియు ప్రతివారికి తెలియునటుల వెల్లడి చేయవలయును. అని పలికెను. ఇంతలో చికిత్సాలయమునుండి సర్జనువారు పంపిన పోష్టుమార్టమ రిపోర్టు వచ్చినది. తక్షణమే సిటీ యినస్పెక్టరువారు సంతకము చేసి యాభటునివద్దనుండి యాకవరుపుచ్చుకొని చించి లోన కాగితము చూచి యిటుల చదివెను.

పోష్టుమార్టమునుచేసి గుండెలు ఊపిరితిత్తులు కడుపు మూత్రపిండములు ప్లీహము కాలేయము మెదడు మొదలగు భాగములనియు తనిఖీచేసి చూడగా కడుపులో కొంచెము మెతుకులతోకూడిన నల్లని పదార్థముగుపడెను. అది హైడ్రోసైనిక్ ఏసిడ్ అని గ్రహించి దానివలననే ఆమనిషి చనిపోయినదనియు నా నమ్మకము.

యమ్. సంజీవి,

సిటీ సర్జన్.

మోహన్ లాల్ గారగు పోలీసుకోశాధ్యక్షుడు అయ్యా! యీ సమాచారమంతయు పూర్తి వార్తాపత్రికలలో వేయించ వలయు ననిపలికిరి. తిరుగ యీ కూనీ సమాచారము విషయమయి చర్చచేయుటకు పోలీసువారందరిని వచ్చునటు లాజ్ఞాపించి మోహన్‌లాల్ మోటారుపై యింటికేగెను. ఇనస్పెక్టరు ముఖర్జీగారు మహమ్మద్ ఖాజీయును హేడ్డును పిలచి "నీవు 112–108 నెంబరుగల కానిస్టేబులుల సాహాయ్యముతో వెళ్ళి బట్టలపైన గురుతులనుబట్టి యవి యేచాకలులు వేసినగురుతులో ఆబట్ట లెవరివో తెలుసుకొని సాయంత్ర మునకు వచ్చిరిపోర్టు చేయు" మని ఆజ్ఞాపించిరి. (78) డెబ్బదియెనిమిదవనెంబరును పిలిచి "నీవు యీశవముఫోటో పూరంతయు త్రిప్పుచు సర్వసమాచారమును ప్రజలకు దండోరా మూలమున తెలువృడుజేసి ప్రియా! పిలువచ్చినయెడల ఠాణాకు తీసికొని రావలసినది" అని యుత్తరవుచేసి వారు యీసంగతి వార్తాపత్రికలలో ప్రచురించుటకు స్వయముగా మోటారుపై బయలుదేరిరి. ఠాణాలోగల తక్కిన భటులు "ఏమిప్రయోజకుడురా హంతకుడు శవమును మనకేదా చెను" అని "యీకేసు మన పీకలమీాద యుండుననియు, యింతలో ఎవరిపుణ్యము పుచ్చునో ఎవరు మట్టమగుదురో యనియు తినబోవుచు రుచి యడుగుటెందుకనియు యిప్పుడిప్పుడే తేలు

నది కాదనియు నెవరికితోచినటుల వారనుకొనుచు కాలయాపన జేయుచుండిరి.

---

## మూడవ ప్రకరణము

---

### "మద్దిల మాణిక్యము"

అరుణోదయసమయమున సూర్యభగవానుని బాలకిరణపుంజము లీమాయాప్రపంచము నాక్రమించుచున్నవి. పద్మబాంధవునిముఖసందర్శనమున కత్యానందపరవశులై రాక రాక వచ్చినప్రియునిజూచినకాంతవోలె పద్మములు వికసించుచున్నవి. విటకాంతను ముట్టడింప మిట్టిపడువిటులవోలె తుమ్మెద లాపద్మినినిచేరి పూదేనెలు గ్రోల నువ్విళ్ళూరుచు గీంకారములతో ప్రదక్షిణములు జేయుచున్నయవి. శీతలమున నాభానుని వేడిమిగలయెండ కాగి సుఖించి యీవేసవి నాతని నిందించుచు విశ్వాసములేని మానవు లున్నారనుచు పురవీధుల సంచరించుచుండిరి. రాజమహేంద్రవరపురవైభవము మా చదువరులెరుంగనిదికాదు. అక్కడి దుకాణదారులకు, గుఱ్ఱము, మోటారుబండ్లవారల కెప్పుడు తెల్లవారినదో గాని విధివిరామములేక వ్యాపారము సాగించుచుండిరి.

పురవీధుల ప్రతిమూలలను గూడ కూనీ సమాచారము మారుమ్రోగుచున్నది. చంపబడిన యా స్త్రీ చాయాపటములు గోడలందక్కడక్కడ వేయబడి యున్నవి అక్కడ ప్రజలనేక మంది చేరి పాపము లక్ష్మివలెనున్నదిరా అమ్మా! యని కొందరు, ధనవంతుని యింటిమనిషియే యని కొందరును, శవము పాటోయయినను ముఖ మతికళగా నున్నదనియు, యేదుర్మార్గు డీఘోరముచేసెనో, వానికి పుట్టగతు లుండవని కొందఱును, యెక్కడనో యెందు కిక్కడనే యనుభవింప జేయుదురు. పోలీసువారనియు అందరు ననేకవిధములుగ నను కొనుచుండిరి. హరిప్రసాదుబా బుదయమున లేచి కమలా ప్రభాకరులతో కాఫీత్రాగుచు చావడిలో గూర్చుని యుండి ఖిన్నవదనుడై "అమ్మా! మీయమ్మసంగతెంత గాలించి నను యేమయినదో దెలియుటలేదు. నాడు రామక్షాలాలు గారింటికి వెళ్ళి తిరిగిరాలేదు. అసలు వారింటికి రాలేదని వారుచెప్పిరి. దారితప్పిపోయిన దనుటకయినను వారి యిల్లు కూడ యీవీధిలోనే కదా? నగల కాసించి యేదుర్మా ర్గులవలనైన నను హానికలిగెనా యని యోచించుటకైన యూహ పట్టపగలేకదా వెళ్ళినది" అని యనుచుండెను.

ఇంతలో వార్తాపత్రిక వచ్చినది. హరిప్రసాదు దందు భార్యపటమును చూచి నిశ్చేష్టుడై సంగతేమో చదువ బోయి, కూనీ, కూనీ యను పెద్దయక్షరములు కనబడినందున

అయ్యో అని కెవ్వుమని యేడ్చి కన్నులనీరుగ్రమ్మ మరి చదువలేక ప్రభాకరున కిచ్చి చదువుమనెను. అతడు చదివినది విని అందరు చాల విచారించిరి. కమల నతికష్టముపై నోదార్చిరి. ఇక యిప్పుడు విచారించిన ఫలమేమి? ముందు ఠాణాకువెళ్ళి ఆమె మన మనిషియని పిరియాదుచేసి కూనీకోరును పట్టుకొనుటకు తగు ప్రయత్నములు చేయించవలయునని ప్రభాకరుడు పలికి మోటారుకొఱకు కమలతో వెళ్ళెను. అమాయకుడు అగు హరిప్రసాదుబాబు భగవంతుని తలంచి "దేవా! నే జ్ఞానమెరిగి చిన్నచీమనయినను మనసారచంపి యెరుంగనే. ఉద్యోగధర్మము నయినను నాచేతనయిన నొకరి కుపకారమే గాని యపకారము చేసియెరుంగనే నాసొత్తొకరి కిచ్చియుంటిని గాని యొకరిధన మన్యాయముగ నేనెరుగనే. తండ్రీ! అట్టి నాకా యాశిక్షవిధించుట. కాటికి కాళ్ళుచాచుకొనియున్న నన్ను ముసలితనమున భరింపరాని యీవిచ్ఛేదక విచారసాగరమున ముంచి విచార మొందజేయుట న్యాయమా? నిత్యము నీతారకమంత్రము జపించుచు నీసేవలయందెక్కువకాలము గడుపుచు సర్వము నీసమర్పణముచేయుచు నినుపూజించెడి నీభక్తునికా యీకష్టము ప్రసాదింపజేయుట" అని అనుకొనుచుండెను.

ఇంతలో కమలాప్రభాకరులు మోటారుబండి తీసికొని వచ్చిరి. వీరుముగ్గురు నాబండిపై బయలుదేరి పోలీసు

ఠాణాకుచేరిరి. అచ్చట సూపరింటెండెంటు, యినస్పెక్టరు మొదలగు పోలీసువారందరు కచేరిచేయుచు "యెవరు మీ" రని యడిగి సంగతితెలుసుకొని హరిప్రసాదుబాబుచే పిరియాది రిపోర్టు వ్రాయించి పుచ్చుకొనిరి. అందిటులు వ్రాయబడి యుండెను.

శ్రీ శ్రీ రాజమహేంద్రవర పోలీసు ఆఫీసరువారి సముఖమునకు దాదా హరిప్రసాదబాబు వ్రాసుకొన్న దరఖాస్తు విన్నపములు.

అయ్యా,

తమరు వార్తాపత్రికలలో ప్రచురించిన స్త్రీ పటము నాభార్య పద్మావతి. మాది బొందిలీకులము. మాభాష హిందూస్తాని. నాభార్య మూడు దినములక్రిందట మాచుట్టమగు రామనులాలుగారి కోడలు పోయినందున వారిని పరామర్శచేసి వచ్చుటకు వెళ్లినది. దీపము పెట్టినవరకూరాలేదు. మాయింటి దాసియగు నరిసిని కబురుపంపించగా వారు మాయింటి కారోజునరాలేదనిచెప్పిరి. అప్పటినుండి కనబడలేదు. ఆమె యేవిధములగు దుర్గుణములు కలదిగాదు గాని మూర్ఖురాలవుటచే తనకు తోచినపుడు నాయనుమతి పొందకయే ధవళేశ్వరములోగల ఆమె పుట్టినింటికివెళ్ళి ఒకటిరెండు రోజులలో వచ్చివేయుచుండెను.

అటులు వెళ్ళియుండునని నిన్న ధవళేశ్వరమునకు కూడ మనిషిని పంపితిని. ఆమె అక్కడికికూడ రాలేదని జవాబు వచ్చినది. దానితో నాకతి బెంగగలిగి యోచించుచుండ పిట్ట పిడుగువంటి మీ ప్రచురణ చూచితిని. నాకుగాని ఆమెకుగాని యెవరును విరోధస్థులు లేరు. నగలకాసించి దొంగలు చంపి యుందురనుటకు నగలన్నియు నున్నటులు మీ ప్రచురణవలన బోధపడుచున్నది. ఈ హత్యావిధాన మతి ఆశ్చర్యముగ నున్నది. హంతకుడెవరో దైవ మెరుంగవలయును కాని నా కెవరిపైన ననుమానములేదు.

ఇటులు,

డి. హరిప్రసాద్.

పోలీసు అధికారి కమలను పిలచి "నీవెవరు ?"

క—దాదా హరి ప్రసాదుగారి కుమార్తెను.

పో-అ—మీతల్లి విమయమై నీవెరింగినది చెప్పుము.

క—మాతండ్రి వ్రాసినరిపోర్టు సమాచారము లన్నియు నిజము. ఈ హంతకు నూహించుటకు నాకవకాశములేదు.

పో-అ—(నగలుచూపి) ఈనగలన్నియు మీతల్లివేనా?

క—అవును.

పో—ఈ రవిక చీరపై గల గుర్తులు నక్షత్రముల గుర్తులు మీచాకలి వేసినవేనా ?

క—అవును.

పో—మీయింటి అందరిదుస్తులకు ఈ విధమగు గుర్తులే యుండునా ?

క—అవును.

పో—ఈ దుప్పటి యెవరిని ?

క—నాకు తెలియదు.

పో—మీచాకలి యిట్టిగుర్తు లెప్పుడును వేయలేదా ?

క—లేదు. మాబట్ట లన్నిటికిని వాడు యెప్పుడును ఒకేమోస్తరు గుర్తును వేయును.

పో—వానిపేరేమి ?

క—చాకలి రాముడు.

పో—సరే యీకాగితముమీాద సంతకము చేయుము.

కమల—చిత్రమని సంతకము చేయును.

ప్రభాకరుని పిలచి పోలీసు అధికారి యిటులడిగెను.

పో—నీపేరేమి ?

ప్ర—ప్రభాకరుడు.

పో—నీవు వీరి కేమగుదువు ?

ప్ర—వీరు నాకు దూరము చుట్టములు.

పో—నీబసయెక్కడ ?

ప్ర—వీరియింటనే.

పో—యెంతకాలమునుండి ?

ప్ర—నాకు మూడుసంవత్సరముల వయస్సునుండి.

పో—నీకు తలిదండ్రులు లేరా ?

ప్ర—లేరు.

పో—నీసంరక్షకులు వీరేనా ?

ప్ర—అవును.

పో—ఎందుచేత ?

ప్ర—హరిప్రసాదుబా బతిధార్మికుడగుటవలన చిన్న తనము నుండి నను పెంచుచు విద్య నేర్పించుచుండిరి.

పో—ఈకూనీవిషయమై నీ కెవరిపై నైనను అను మానముగలదా ?

ప్ర—లేదు. హరిప్రసాదుబాబుగాని ఆమెగాని యెవరి కిని విరోధులు కారుగాన నాకును హంతకు డెవరాయని వింతగనే యున్నది.

పో—సరియే యీవాఙ్మూలముపై సంతకము చేయుడు అని చెప్పిరి.

ఇంతలో మహమ్మద్ ఖాజీ యను హేడ్ వచ్చి యజ మానులకు సలా మొనర్చి "అయ్యా ! యీచాకలిరాముడే బట్టలపై గుర్తు వేసెనని తెలుసుకొని వీనిని తీసుకొని వచ్చితిని" అని రాముడుని యినస్పెక్టరు వారియెదుట నిలిపెను.

ఇ— ఏమిరా యీబట్టలపై గుర్తును నీవువేసినవేనా ?

చా—చిత్తం.

ఇ—ఈ బట్టలెవరివో పోల్చగలవా ?

చా—అరిప్రసాదబాపుగారివండి.

ఇ—ఇవన్నియు వారివేనా ?

చా—ఈ దుప్పటి కాదండి.

ఇ—దీనిపై గుర్తు నీవువేసినదేనా ?

చా—అవునండి.

ఇ—ఈదుప్పటి యెవరిదో చెప్పగలవా ?

చా—చిత్తం భోగంవారిదండి.

ఇ—పేరెవరు ?

చా—మాణిక్యం.

ఈసమయములో మహామ్మదు ఖాజీ "అయ్యా ! ఆ సంగతికూడ యెన్క్వైరీచేసి ఆమెనుగూడ ఠాణాకు తీసికొని వచ్చానండి" అని పలికెను.

ఇ—(ఆమెను రప్పించి) ఈదుప్పటి యెవరిది ?

మా—నాదియేనండి.

ఇ—నీకులం ?

మా—వేశ్యకులం.

ఇ—నీపేరు?

మా—ముద్దుల మాణిక్యం.

ఇ—జీవనం?

మా—వ్యభిచారము.

ఇ—ఈ వూరిలో కూనీసంగతి వింటివా?

మా—అందరు ననుకొను చున్నారండి.

ఇ—ఈ ముద్దాయిని యెరుంగుదువా?

మా—ఈ ప్రభాకరునిగారి నెరుగుదును.

ఇ—ఎటులు?

మా—ఈయన అప్పుడప్పుడు మాయింటికి వచ్చివెళ్ళు చుండెడివారు.

ఇ—ఈకూనీ విషయమయి నీకేమయిన తెలియునా?

మా—తెలియదు.

ఇ—ఈ నీచుప్పటి శవము పెట్టెలోని కెట్లువచ్చినది?

మా—నాకు తెలియదు.

ఇ—నీవిది యెవరికైన నెరువిచ్చితివా?

మా—అవును.

ఇ—ఎవరికి?

మా—ఈ ప్రభాకరుడుగారికే

ఇ—ఎందువలన?

మా—ఒకనాడీయన మా యింటినుండి పోవునప్పుడు

తెల్లవారుజామున నౌకరులు చూచినను పోల్చకుండుటకై యీ దుప్పటి కప్పుకొని వెళ్ళియుండిరి.

ఇ—ఈయన స్వభావమెట్టిది.

మా—క్రూరమైనది.

ఇ—నీకెట్లు తెలియును?

మా—ఒకసారి నాపయి కోపముగల్గి జాగ్రత. నేను వైద్యుణ్ని, ప్రాణము తీయుట నిలుపుట నాచేతిలో నున్నవి. అని జడిపించిరి.

ఇ—నీపై నెందులకు కోపమువచ్చినది?

మా—ఈతని విరోధియగు రామన్‌లాల్ కుమారుడు గారితో మాటాడితినని.

ఇ—రామన్‌లాల్ ఎవరు ? వీరిరువురికి విరోధమెందులకు?

మా—ప్రభాకరుడుగారు పెండ్లాడదలచిన కమలను పెండ్లాడ ఆయనకూడ ప్రయత్నించు చున్నారని.

ఇ—నీవు యీయన యింపుడుక త్తెవుగదా? ఇట్లీయన కు వ్యతిరేకముగ సాక్ష్యమిచ్చుచున్నావేమి?

మా—సమయము తప్పి వచ్చుటచేతను నాప్రాణమానములు కాపాడుటకును.

ఈ మాట లాలించి యినస్పెక్టరుగారు ప్రభాకరుని పిలచి అయ్యా! యీమాణిక్యము చెప్పినమాటలన్నియు విం

టిరిగదా ? ఈమొహాత్మ్యమువలన మీా రీకూనీతో సంబంధించిన వారని మాకు నమ్మకము కలుగుచున్నది. దీనికి మీారే మందురు.

ప్ర—అయ్యా ! యీస్త్రీయెవరో నేనిదివరకెరుంగను ఈమెనుచూచుటకిదియే మొదటిసారి. రామన్‌లాల్ కొడుకు కమలను వివాహమాడ ప్రయత్నించుచున్నను నాకతనిపై విరోధము లేదు. నాస్వభావమెట్టిదో యీ హరిప్రసాదుబాబు గారిని అడిగిన తెలియగలదు. ధనమున కాసించిమానమమ్ము కొను యీమాణిక్యము మాటలనుబట్టి మీారు నన్ను హంత కునిగా యూహించుట ధర్మముగాదని పలికెను.

ఇ—హరిప్రసాద్ గారూ ! ఇతనిపై మీా కనుమాన ముగలదా ? ఇతడెట్టివాడు ?

హ—ఇతడు గుణవంతుడనియు, విశ్వాసపరుడనియు వ్యభిచారగుణము లేనివాడనియు నేను నమ్మియే నాకుమార్తె నిచ్చి పెండ్లిచేయ దలంచితిని. అందులకు నాభార్య అడ్డు వచ్చుటచే ఆకార్యము యింకనూ జరుగలేదు. నాకుమార్తె కితనినే పెండ్లాడ తలంపుకాని నాభార్య యొప్పుకొనక రామన్ లాల్ కొడుకు ధనవంతుడని వానికిమ్మని పోరుపెట్టెడిది. నేను యేమాటయు నిశ్చయించక కాలయాపన జేయుచు వచ్చితిని. ఇంతలో యీఘోరము జరిగినది. ఈ మాత్రము ప్రభాకరు డీఘోరము చేయునని నేననను.

పిదప యినస్పెక్టరుగారు ముద్దిల మాణిక్యమును, చాక లిని కేసులో సాక్షులుగా నమూజుచేసికొని వుత్తరు వవగానే తక్షణమే వచ్చిన బ్లాక్షాపించి పంపివేసి సూపరింటెండెంటు గారితో కలసి కొందరు రక్షకభటులు హరిప్రసాదుప్రభాకరు లను తీసికొని వారి యింటికేగిరి.

---

## నాలుగవ ప్రకరణము

---

### "పరిశోధన"

రాజమహేంద్రవరమున హరిప్రసాదుగారి యిల్లు మె రుంగని వారు లేరు. పోలీసు అధికారులందరు హరిప్రసాదుగా రింటికివచ్చి ప్రభాకరునిగది శోధనచేయ మొదలిడిరి. ఇనస్పెక్టరు గారగు ముఖర్జిగారును, మరియిద్దరు తగుమనుష్యులును గదిలో ప్రవేశించిరి వారికి కేసునకుకావలసిన సామగ్రులేమియు దొరక లేదు. గాని హైడ్రోసైనిక్ ఏసిడ్డు అని లేబిల్ వేయబడియున్న దొకసీసా దొరికినది. సూపరింటెండెంటుగారగు మోహానలాలు గారదిచూచి డాక్టరురిపోర్టులో వ్రాయబడిన విషముపేరుకూడ యిదియే అయినందున ప్రభాకరునిపై నిదియొక సాక్ష్యమని అందరికి చెప్పి కేసు రుజువగుచున్నందుల కతి సంతోషించిరి.

ఆగదియందుగల పెట్టెలు, బీరువాలు, అలమరలు సర్వమును గాలించిరి. ప్రభాకరుని చందుకపెట్టెమాత్రము తాళము వేయబడి యుండుటచే యువతలకు తెచ్చి ప్రభాకరుని తాళము యిమ్మని యడిగిరి. "దానితాళ మెక్కడనో పోయినది. ఇంకను మరియొకటి చేయించలే"దని ప్రత్యుత్తర మిచ్చెను. పోలీసు అధికారులది బ్రద్దలుచేసి తెరువ నాజ్ఞాపించిరి. ఆ భటులటు లొనర్చిచూడగా, అందు కమలఫోటోయును, ప్రభాకరుని పేరుగల కవరులును, కాగితములు, కార్డులును, కొన్ని కలములు, పాళీలుగలవు. ప్రేమసంబంధమగు కథలుగల యింగ్లీషు, తెలుగు పుస్తకములు గలవు. ఆపెట్టెకు ఒక దొంగఅర యున్నది. అది తెరచిచూడగా అందొక మోహలేఖ దొరకినది. దానియం దిటులు వ్రాయబడియున్నది.

"ప్రభాకర మహాశయా !"

చిన్నతనమునుండి నాస్నేహముచేసి యిప్పుడా కమలను మోహించి పెండ్లాడదలంచి నన్ను విసర్జించుట న్యాయము కాదు మీరు పెండ్లియే యాడనన నాతో యెన్నివిధముల బాసచేసితిరో జ్ఞప్తి తెచ్చుకొనగోరుచున్నాను. అందునను కమల తల్లికి మీపై నిష్టములేదనియు. ఆమె జీవించియుండిన మీకు కమల నీయదనియు మీరే చెప్పితిరికదా ? అత్తమామల కిష్టములేని పెండ్లి యేమిసౌభాగ్యముగా నుండును. గాన దయ

యుంచి నన్ను పెషు చేయక స్వీకరించి విడువకుండగలందులకు ప్రార్థితులు.

ఇట్లు,
"యమ్. మాణిక్యం."

మోహనలాలు, ముఖర్జీ మొదలగువారీయుత్తరము చూచి యిదికూడ మన కనుకూలముగానే యున్నది. ప్రభాకరుడే హంతకుడని నిశ్చయించినందులకు యీ సాక్ష్యములు చాలునని తక్షణము ప్రభాకరునికి బేడీలు తగిలించి కారాగారమునకు తీసికొనిపోవ బయలుదేరిరి. కమలముఖియున కత్తి వ్రేటునకైన నెత్తురులేదు. నీటినుండి త్రుంచి బయట పారవేయబడిన తామరకమలమువలె యీమె ముఖకమల మతివాడియున్నది.

శరీర మాపాదమస్తకము ముచ్చెమ్మటలు బోయుచున్నవి. ప్రభాకరుడు హంతకుడగునా కాడా యనియు, మాణిక్యమునకు నితనికి స్నేహముగలదా లేదా యనియు యోచనలపై యోచనలు జేయుచున్నది.

హరిప్రసాదుబాబుకూడ యోచనలలో తక్కువవాడు గాదు. ప్రభాకరుని విషయమై యెటు నిశ్చయించుటకును అతనికి పాలుపోలేదు. పోలీసువారందరు ప్రభాకరుని కారా

గారమునకు తీసికొనిపోయిరి. పిదప హరిప్రసాదు కుమార్తెతో యిటుల ప్రసంగింప ప్రారంభించెను.

హ.—అమ్మా కమలా ! నీవు జ్ఞానవంతురాలవు గాన చెప్పుచున్నాను. మీయమ్మ అకస్మాత్తుగ పోవుటవలన నాకు గూడ విచారముగనున్నది గాని దైవకృప కేమి చేయగలము. మన కర్మఫల మనుభవింపకతప్పదు. జరిగినదానికయి విచారించినను లాభములేదుగాన మనబుద్ధికుశలతయుపయోగించి నిజమగు హంతకుడెవరో తెలుసుకొనవలయును. నిర్దోషులను రక్షించి దోషులను శిక్షింపజేయవలయును. ఏజన్మమున నెవరి నన్యాయముగ జంపించితిమో యీజన్మమున నిటులనుభవించుచుంటిమి. శరీరము లశాశ్వతములు. కీర్తియే నిలుచునది. ఏమియు శాశ్వతము కాదనుటకో యనునటుల పసిబిడ్డలమయి జన్మించి, పిదప బాలురమయి, కొంతకాలమునకు వయోవంతులమయి, తదుపరి ముదుసలులమయి నశించుచున్నాముగాన శాశ్వతమగు కీర్తినందవలయును. నీవింముల కుద్యుక్తురాలవగుము. నేను ముదుసలినయినను తగిన సలహా లిచ్చుచుండెదను. ప్రభాకరుడే హంతకుడని సాక్ష్యములు వచ్చినవి. నీకు వినినపై నేమితోచినది.

క.—తండ్రీ ! మీ ప్రబోధనలవలన నామనమునగల విచారమంతయు పోయి హంతకుని పట్టుకొనవలయునని పట్టు

దలయు, న్యాయావలంబన మొనర్చి శాశ్వతమగు కీర్తి నొందవలయునని కుతూహలమును ఉద్యమించుచున్నవి. ఏమయినను యిది అంతిమలభముగా యోచించవలసిన హంశముగాదు. సాక్ష్యములన్నియు ప్రభాకరునిపై నున్నను నిదానించి గ్రహించవలసినసంగతు లనేకములున్నవి కాలవైపరీత్య మతివింతగానున్నది కూనీచేయువాడొకడు. ఉరికెశిక్ష నొందువాడు మరొకడు. దొంగతనము చేసినవాడొకడు, కారాగార ప్రాప్తియింకొకనికి. తప్పుజేయువాడొకడు, నిందింపబడువాడు మరియొకడు. ఇవన్నియు సాక్ష్యములుమాత్రము పరిశీలించి విధించినశిక్షలేగాన నిజానిజములెరుంగనిదె యిదమిత్థమని నిశ్చయించుట కానిపని. అపరాధపరిశోధన కఖండజ్ఞానముండవలయును. ధైర్యస్థైర్యము లవలంబించు కుశాగ్రబుద్ధియయి యుండవలయునుగాని యేమయినను యీమహాకార్యముననే బయలుదేరి తరచు తమనలహాలసంకుచు నిజమగు హంతకుని తెలుసుకొనవలయునని యున్నది అనిపలికెను.

హా—కుమారీ! నీకోరిక కడుసమంజస మయినది. నీవిందుకు తగిన చతురవనియే నిన్ను యీపనికి పూనుమని కోరితిని. ప్రభుత్వమువా రనేకములగు పత్తేదారులను వేయుచున్నారుగాన నీ పీతక్షణమె వారికొక దరఖాస్తు పంపుము.

[5]

# అయిదవ ప్రకరణము

## "సబ్ జెయిలు"

ప్రభాకరుని కేసు పూర్తిగా విచారణమగువరకు సబ్ జెయిలునం దుండునటులుగా అధికారులయాజ్ఞ అగుటచే వాని నచ్చట ఖయిదీగా యుంచిరి. సుమారు రాత్రి పన్నెండు గంటలు కావచ్చినది. ఇనస్పెక్టరు మొదలగు పోలీసు అధికారుల బీటు చెకింగు అయిపోవుటచే సెంట్రీ మొదలగు పోలీసు భటులు గోడలకు జారబడి కొందరును, ప్రక్కలపై కొందరును, కుర్చీలపై కొందరును, బల్లలపై కొందరును, పచారు చేయుచు కొందరును నిదురనొందుచుండిరి. ఖయిదీల కొట్లులలో దీపములులేవు గాని యొకబల్లపై మినుకు మినుకు మని యొకదీపిక గలదు. ఇల్లుకన్న గుడి పదిల మనునటు లూహించి గావలయును. ఖయిదీలుగూడ నిద్రాదేవికి వశ్యులయి గాఢ నిదురనొందుచుండిరి. ఒకగదియందున్న ఖయిదీమాత్రము నిదురలేక కూర్చునియుండి యిటు లనుకొనుచుండెను. "కారాగృహనివాసము నిర్దోషికి నీచతరమైనదికాదు. దోష రహితమగువా డెచటనున్నను నొకటియే. దోషికిస్వేచ్ఛావిహార మున్నను మన స్సతిఆందోళనాపూరితమయి బాధింపబడుచునే యుండును. కారాగృహము నీచమయిన స్థలమైనను యోగ్యులకు యోగ్యమయినదియే. పూర్వ మాభక్తాగ్ర గణ్యుడు

ధర్మశీలుడు, పాపరహితుడు, నిరంతరరామపూజాధురంధరుడు, శ్రీరామభక్తశ్రేష్ఠుడు, రామదాసు ఉండలేదా! మాయామానుషవిగ్రహుడు శ్రీమన్నారాయణుడు, గోపాలబాలుడు, గోపికావల్లభుడు, శ్రీకృష్ణభగవానుడు జన్మించిన పరమ పావనమగు స్థలంబుగదా? మరియు నెందరో మహాత్ములు నిర్దోషులగు దేశసేవాధురంధరులు యిట నివసించి పరత్యాగ మొనర్చియుండలేదా? అట్టిస్థలమున నుంచిన మాత్రమున నాకేమియు విచారములేదు గాని యీనిందకూడ నెత్తిపె బడినదే నిందో నిజమో యెవరెరుంగగలరు. వారియనుమాన మునకు తగినటుల ఉత్తరములు మొదలగు సాక్ష్యములు గూడ వారికి దొరికినవే. ఇక నేనెంత యోచించినను లాభ ములేదు. మంచిగామాటలాడిన వీరు వినరు. ఏదోవిధమున వీరిని మోసగించి యీ కారాగృహము దాటుసూత్రమాలో చింపవలయును. అబ్బా! యెంతగట్టియూచలు బిగింపబడియు న్నవి. తలుపులు గోడలుకూడ కంగుమని కంచువలె మ్రోగు చున్నవే, ఏముచేయుదును" అనుకొనుచుండెను. ఇంతలో నొకవ్యక్తివచ్చి మెల్లగ బల్లపై దీపమార్పి కిటికీవూసలు కోసి యుంచితిని ఆదారిని బయటకురమ్ము. జాలమొనర్చిన మోస మురాగలదు. అని చెప్పిపోయెను. కొంతసేపటికి పోలీసు భటులందరు కలవరపడిలేచి దీపము వెలిగించి లోనగల ఖైదీని గానక యీలలువేసి ఒకరినొకరు పిలుచుకొనుచు నలుదిక్కు

లకు పరుగెత్తిరి. తిరిగి తిరిగి ఒకమానవుని పట్టుకొని నే దొంగను కాను మొర్రో యనుచున్నను విడువక బలవంతముగ అందరునుపట్టి యీడ్చుకొనివచ్చి వానిని కారాగృహమున వేసిబీగము బిగించిరి. తత్క్షణమే వారి యధికారికి ప్రభాకరుడను కూనీనేరస్థుడు జయిలుగది కిటికీవూసలు కోసుకొని పారిపోయి నాడనియు ననేక శ్రమలనొంది మేమందరము వానిని తిరుగపట్టుకొని కారాగారము చేర్చితిమనియు రిపోర్టువ్రాసి పంపిరి. జయిలులో పడిననూతనవ్యక్తి ధరించిన కౌపీనము నుబట్టియు, వానిచర్యలనుబట్టియు, మాటలునుబట్టియు చూడ నున్మాదునివలె గోచరింపక మానడు. లోనున్న వెర్రి వాడిటుల మాటలాడుచుండెను. హా హా హా ప్రపంచకచర్య లెంతవింతగనున్నవి. మానవులార మీకింకనూ తెలియలేదా తెలియపరచెదను. వినుడు, వినండోయి వెర్రిమొకాల్లార వినండి. వస్తువపడిన దొకచోటు, వెదకెడిది మరియొకచోటు, భయపడి నమస్కరించువానిని తన్నుట, తిరుగబడి కొట్టు వానికి నమస్కరించుట. ఉపకారికి నపకారము, అపకారికి నుపకారము. దొంగను నమ్ముట, మంచివానిని నమ్మకపోవుట మాటలలో తేనెలొలుకుచుండును, మనస్సున విషము ద్రవించుచుండును. ఎంతని చెప్పను. మనసోదరు లీవిధమున చరించుచున్నవారలు. ఏరీ మానవు లిచట సభలో లేనే లేరా సభ్యులు లేనిసభ కుపన్యాసకుడనా నేను. ఎవరునులేరు,

పోనీ మాతలువు యాచలు నామాట లాలించును. మాగోడలు వినును. మాతొళ్ళములు వినును. నానభకు సభ్యులు వీరు. అని యేమేమో నోటికివచ్చినటు తెల్ల వాగుచుండెను. ఇంతలో తెల్లవారినది పోలీసు కోశాధ్యక్షులందరు వచ్చిరి. నూతనఖయిదీని బయటకుదీసికొని రమ్మనిరి. వీరినిజూచి అందరాశ్చర్యమునొంది అయ్యో అసలు ఖయిదీ ప్రభాకరుడు మోసగించిపోయెను. దీనంతటికి రాత్రి చౌకీదారులగు భటుల అజాగ్రతయే కారణము గాన వారందరికిని సల్లమార్కుటీయుమని పోలీసు కోశాధ్యక్షు డాజ్ఞాపించెను. ఈవెర్రివానిని బిలచి యిటు లడిగిరి.

పో—నీవెవరు?

వె—నీవెవరు?

పో—సమముగా జబాబిచ్చెదవా లేదా?

వె—నేను నేనేనండి.

పో—జాగ్రత, కంచీ దెబ్బలుతగులును.

వె—పగలనీవోయి అన్నయ్యా, మనకు భయము లేదు.

పో—నీది ఏవూరు.

వె—అన్నివూరులు నావేగాని బ్రదర్! నీమెడలో ఆతోలుడవాలీయెందుకు? నాకుగూడ తగిలించు చూదాము.

పోలీసుఅధికారులందరు వానిని వెర్రివానిగా గ్రహించి వదలిపొమ్మని ప్రభాకరుని పట్టుకొనుటకు తగుప్రయత్న

ములు జేయవలయుననియు యిందులకు తగిన అపరాధపరిశోధకునిగూడ నియమింపవలయుననియు ప్రభాకరుడే హంతకుడనుటకు అతడు జెయిలునుండి పోవుట ఒకసాక్ష్య మనియు నాలోచించి తమపరి యేర్పాటులుచేయుట కందరును పయనమై నబ్జైలు వీడిపోయిరి.

---

## ఆఱవ ప్రకరణము

---

### "దానవాయిగుంట"

క్రొత్తగా జరిగిన ఖూనీకేసులో నిజమగు హంతకుడెవరో పట్టుకొనుటయు పారిపోయిన ముద్దాయిని తిరుగ బట్టుకొనుటయు పోలీసువారి ఒక్కరి చేతగాదని యూహించి గావలయును ప్రభుత్వమువారు కమలాకరుడను అపరాధపరిశోధకుని నియమించిరి. అతడు సుమారు పాతిక సంవత్సముల వయస్సువాడనియు, మంచి రూపసియనియు, వడిదిరిగియున్న మీసములును వుంగరములవలె వంగియున్న ముంగురులుగల గిరిజాయును అతని ముఖమున కతి అందమిచ్చుచున్నవనియు, యిన్నేల అతని జూచిన మొగవారికి సహితము మోహము గలుగుచున్నదనియు, మహాశూరునివలె గన్పడుచున్నాడనియు, అతని జూచినంతనే చోరులకు

భయమును వీరులకానందమును గలుగుచున్నవనియు, ప్రజ లందరు పలువిధముల ననుకొనుచుండిరి మన క్రొత్తడిటెక్టివ్ బస దానవాయిగు టవద్ద నొక సుందరభవనము నద్దెకు తీసు కొని నివసించెను. రాజమహేంద్రవరమున కించుక ఆరోగ్య ప్రదేశ మదియే. ఒకనాడు మన కమలాకరుడు రాజమండ్రి పోలీసు అధికారులందరిని తన యింటికి రావించి వారితో యిటుల సంభాషించుచుండెను.

క—ఏమండీ మోహనలాల్ గారు! యీ కూనీవిష యమయి మీ యుద్యోగస్థులందరు యిప్పటికి జరిపించిన రికార్డంతయు తెప్పించినారా?

మో—అయ్యా యినస్పెక్టరుగారు మనరికార్డంతయు వారి కీయండి.

క—అయ్యా! శవము ఫోటోయును పారిపోయిన ఖయిదీ ఫోటోయును నాకు కావలయును.

ఇ—అయ్యా! చిత్తం యిదిగోనండి.

క—మోహనలాల్ గారు యీ కేసునందు మీ యభి ప్రాయమేమి?

మో—అయ్యా! సాక్ష్యములన్నియు చూడగా ప్రభా కరుడే ఘాంతకుడని సూచన గలుగుచున్నది. మద్దిల మాణిక్య మున కూడ యిందులో సంబంధ ముండునని నా కనుమాన ముగ నున్నది.

క—ఇనస్పెక్టరుగారు! యీ పురసమాచారము నా కించుక తమరీయవలయును. కేడీల లిస్టు నస్పెక్టర్సు లిస్టు నాకు కావలయును.

ఇ—చిత్తము యివిగోనండి లీస్టులు. తమ సెలవగునావు డెల్ల హాజరగుచుండెదను.

క—శవము దొరికినపెట్టె, ముప్పటి, బట్టలు, నగలు, వగయిరా ప్రతిసామాను జాగ్రతగా నుంచిరా?

ఇ—చిత్తము.

ఈసమయమున తపాలవా మత్తరములు తీసుకొని వచ్చెను. అందు కమలాకరున కొక జాబున్నది ఇది యెవరు వ్రాసిరో అని విప్పి యిటుల చదివెను.

క్యాంపు
నవ్యగ్రామము
4—10—29

కమలాకర మహాశయా!

మీరు కూనీకేసు విషయమయి పత్తేదారుగా నియమింపబడిరని మా హుజూరునకు తెలియవచ్చినది. మీ యుదంతము విని నాకు చాల విచారముగ నున్నది. మీరు బాలురు. పిల్లకాకికేమి తెలియు వుండేలుదెబ్బ యనునటుల మా పరాక్రమము మీ రెరుగరు. నేనొక్కడనుగాను నాచేతిక్రింద దొంగలు, గజదొంగలు, దోపిడిదొంగలు, బందిపోటు

దొంగలు, చోరులు, చోర పితామహులు, మొదలగు మహా మహు లనేకులు గలరు. వారు మహిమ లతివర్ణనాతీతములు. నిత్యము మాతో బాధపడుచుండెడి మా పోలీసుసోదరుల నడిగి చూడుడు. మీరు యిప్పటినుండీ యీ యుద్యమమును ముగించిన బాగుగా నుండును. లేనియెడల ప్రాణహాని తప్పదు. బాలురని కనికరించి యిటుల మీ కెరుకవ్రాసితిని. హంతకుని పట్టుకొన బయలుదేరు పత్తేదారు పనియనిన సామాన్యము గాదు. పులిమీసములుబట్టి ఉయ్యాలలూగుట. మృత్యుదేవత నోటబడి దప్పించుకొనిన నప్పించుకొనవచ్చునుగాని నాచేతబడి దప్పించుకొను టసాధ్యము. యమపాశమునకైన దొరకకపో వచ్చునుగాని నా పాశమున కడ్డులేదు. నేనసర్వసామాన్యమగు మూర్ఖుడనుగాను. బహు విద్యావంతుడను. నేనవసరమగు నపుడు, యంత్రములో, మంత్రములో, మందులో ఉపయో గించి నాపని ముగించ గల సామర్థ్యతను నేనీ వంగితులన్ని వ్రాయుట మీరిది అతిశయోక్తులని యూహించకుడు. కొన్ని కారణములచే యీకూనీ చేసితిననియును పట్టుకొన ప్రయత్నము మాని, ఇకముం దట్టి ప్రయత్నము చేయువద్దనియు మా పోలీసు సోదరులకు తొలుతొలుతనే వ్రాసియుంటిని వారలది లెక్కచేయలేదు. మీరయినను నామనవి విని యీ యుద్య మము మాన ప్రబోధింప వలసినది. లేనిపక్షమున నికముం దెన్ని హత్యలు చేయుచుండునో యెందరి కెట్టి యిక్కట్టులు

గలుగజేయుదునో యెట్టి మహామహులు నాచే చంపబడ నున్నారో నాకే తెలియదు. ఎంతనిద్రాయను. నా చర్యలు నామాయలు తరగని తంపెవంటివి.

ఇట్లు,
హంతకుడు.

క—అయ్యా! ఉత్తరమిదివింతగనున్నది. హంతకుడతి చతురుఁడు గాని మూర్ఖుడుగాడు. నేవచ్చినసంగతి యప్పుడే వాడెటులో తెలుసుకొనియెను. ఉత్తర మీగ్రామముననే తపాలో వేసెను. ఇదిగో యీవూరి పోష్టుముద్రయే యున్నది. నాకీపత్తేదారుపని ప్రథమమయినను చిన్నవాడ నయినను వీని టక్కరిమాటలకు లెక్కసేయను. నరిదే యేమి చేయగలడో చూచెదను.

మీరందరును యీతక్షణము బయలుదేరి శవముంచ బడినపెట్టె విక్రయించినవారిని తెలుసుకొని రహస్యముగా నాకెఱింగింపుడు. అని చెప్పెను. పోలీసువారందరు పనిపయిని పోయిరి. కమలాకరుడుగూడ లోన భోజనమునకు వెళ్లెను.

# ఏడవ ప్రకరణము

---

## "సారంగధర మెట్టు"

నడివేసవి, మట్టమధ్యాహ్నము సూర్యుడు నడినెత్తిని తాండవమాడుచు ప్రపంచమునంతయు భస్మముచేయ సంకించుచుండెనో యనునటుల తనప్రచండకిరణము లీభూప్రపంచముపై వెదజల్లుచుండెను. ఎండగాడ్పుల కాగజాలక ప్రతివారి గృహద్వారములు మూసికొనియే యుండిరి. ఈసమయమున బజారులో మసీదువద్ద పటాలవీరన్న కొట్టువద్ద నొకచలనహేతు శకటమాగినది. అందుండి ఒకవ్యక్తి చేతనొక ట్రంకు పెట్టె పట్టుకొని క్రిందదిగి వీరన్నను కలుసుకొని అయ్యా! యీమాదిరిపెట్టె మాకు కావలయును ఏమియు తేడా యుండకూడదు. ఈ పెట్టె మీరు విక్రయించినదేనా?

వీ—అయ్యా! యీపెట్టె మాషాపులో అమ్మినదే.

వ్య—వీనిధర శిసలుగా నుండవలయును. ఇదివరకెంతకమ్మిరో యెవరికమ్మిరో చెప్పినగాని మాకు జరూరులేదు.

వీ—అయ్యా! యిట్టి పెట్టెలు మేము వేనకువేలు తయారుచేసి విక్రయించుచుందుము. గాన యెంతకమ్మితిమో యెవరికమ్మితిమో వ్రాయము.

వ్య—మీకొట్టుకు అరువుకాతా యేమయినన్నదా?

వీ—మీకీ అనవసరపు మాటలన్ని యెందుకండీ.

వ్యా—అవసరమగుటచేతనే అడుగుచుంటిని.

వీ—మీకవసర మయినను చెప్పుట నాకు జరూరు లేదు.

వ్యా—చెప్పకతప్పదు.

వీ—నిర్బంధించుటకు మీరెవరు ?

అప్పుడావ్యక్తి నేనెవరోచూడుమని తనకోటుకు లోపల తగిలించియున్న డిటెక్టివ్ అను బిళ్లను చూపించెను.

వీ—బాబూ ! యీసంగతి ముందుగనే చెప్పక పోయి తిరా ? తమ కభ్యంతరముండునా ?

డి—సరియే కాలయాపనచేయక మీచిట్టా ఆవర్జా లన్నియు చూపుము.

వీ—అయ్యా ! అవన్నియు నిక్కడలేవు. మాకార్ఖా నాకు యీరోజుననే పంపివేసితిని. రేపు దాఖలుచేసెదను.

డి—అట్లల పనికిరాదు. నాకు యీతక్షణమే కావల యును.

వీ—మాకార్ఖానా చాలదూరమండి.

డి—ఎక్కడ ?

వీ—సారంగధర మెట్టపైన.

డి—ఏమయినను జాగుచేయుటకు పనికిరాదు. నాతో నామోటారుపైన రావలయును.

పీ—చిత్రం పడండి.

మన అపరాధపరిశోధకుడు కమలాకరుడు యీ వీరన్న కూడ హత్యకు సంభవించిన దోషియయి యుండునని అనుమానించి వీరన్నను కార్కానాకు పోలీసుసాహాయముతో వెళ్ళ దలంచి తాను వీరన్నతో మోటారునెక్కి డ్రయివరును బండి తిన్నగా ఠాణాకు తీసుకపొమ్మని ఆజ్ఞాపించెను.

మోటారుబండి వీరన్న కొట్టువద్దనుండి బయలుదేరినది. మోటారు శరవేగమున నిరపాయముగ నడిపించుచుండుటచే అది నడుపునతడు కడుసమర్థుడని తోచుచున్నది. మోటారుబండి మార్కెట్టు ప్రక్కవీధినుండి మెరకవీధిగుండా వెళ్ళి జామిపేట మీదుగా తీసుకొనిపోయి సారంగధర మెట్ట వద్ద నిలిపెను. కమలాకరు డతికోపముజెంది తన డ్రయివరుపై కనులెర్రజేసి ఫూల్ నిన్ను ఠాణాకు బండి తీసుకు వెళ్ళమంటినిగదా ఇక్కడి కేల బండి తెచ్చితివి.

డ్ర—నేనుకాదు ఫూల్ నీవే అయితివి.

క—ఏమి?

డ్ర—నీశత్రుని బండి యెక్కుటచేత.

క—ఏమి నీవే హంతకుడవా?

డ్ర—కాదు నేను వానిసేవకుడను.

క—నన్నేల యిక్కడకు తీసుకొనివచ్చితివి?

డ్ర—మా యజమానికి మిమ్ము వప్పగించుటకు.

క—నన్ను నీవెటులెరుగుదువు ?

ద్ర—నిన్న మీరు దానవాయిగుంటలోగల మీయింటిలో పోలీసువారితో సంభాషించిన సంభాషణవిని.

క—(పిస్తోలుజూపి) దుర్మార్గుడా ! బండి తిన్నగా ఠాణాకు తీసికొనివెళ్లుము. లేనియెడల నీకు చావుతప్పదు. అని క్రిందదిగి ముందునకు వెళ్లెను.

ఇంతలో బండిలోనున్న వీరన్న మొలనున్న పిస్తోలు బయటకుతీసి కమలాకరుని చేయిపై గొట్టెను. పాపము ! కమలాకరుని తనచేగల పిస్తోలుజారిక్రిందబడినది. బండిలోనుండి డ్రయివరు గుభీమని క్రిందదిగి నేలబడిన పిస్తోలందుకొని కమలాకరునివైపుజూపుచు నీవిక నేమనినను లాభములేదు. తిన్నగా కొండపయికి నడువుము. లేకున్న నీప్రాణములు దక్కవు. అనిపలికెను. కమలాకరు డేమిచేయుటకును వీలులేక వీరలు చెప్పినచొప్పున నడచి వెళ్ళుచుండెను.

వీరన్న, డ్రయివరు, చేత పిస్తోలులు పట్టుకొని కమలాకరుని వెనుకనుండి వచ్చుచు కొండపైగల యొక గుహాద్వారము తెరచి లోన ప్రవేశించి డిటెక్టివ్‌ను కదలలేకుండగట్టి గుహాద్వారముచెంత వారిభటుని కావలియుంచి కొండదిగిపోయి మోటారుబండి నెక్కిపోయిరి.

---

# ఎనిమిదవ ప్రకరణము

## "లుబ్ధాగ్రేసరచక్రవర్తి"

రాజమహేంద్రవరమున రామన్‌లాల్ గారి యిల్లు ఆర్యాపురములోనున్నది. ఇతడించుమించు అరువది సంవత్సరముల యీడుగలవాడు ఈయన కించుమించు నలుబది, యేబదివేల వరకాస్తిగలదని గ్రామమంతయు వాడుక గాని, కాకికిచెయ్యి విదపడు. తైలసంస్కారములేక జడగట్టినజుట్టు, క్షవరము లేక పెరిగియున్న గడ్డము, ధరించిన చింకిగావంచ, తాడుకట్టబడిన సులోచనములు మొదలగు వాటివలన నాతని చూచిన ప్రతివారును లుబ్ధాగ్రేసరుడని చెప్పకయే తెలుసుకొనగలరు. ఈత డెప్పుడును అవసరముగ యిల్లువిడచి యీవలకుపోడు. ఎప్పుడును తనబొక్కిసందుగవద్ద వేయబడిన చింకిగోనెపై గూర్చునియే పత్రమునకెంత వడ్డీయగునో యేతాకట్టుఆస్తి యెప్పటికి భుక్తమగునో యేప్రామిసరీనోటు బావాకు పంపవలయునో చూచుకొనుచుండును. ఈ లుబ్ధాగ్రేసరచక్రవర్తి కొక కుమారుడు గలడు. అతడు సరసాగ్రేసరచక్రవర్తి. ఆతనిపేరు జూరత్తులాల్. ఆతని మూడవభార్యయే యీమధ్య చనిపోయినది. నాల్గవపెండ్లికి తండ్రి ప్రయత్నించుచుండెను. జూరత్తులాల్ మహాజారుడు, త్రాగుబోతు, దుర్మార్గుడు, కఠినాత్ముడు, మద్దిల మాణిక్యమను వేశ్యనుంచుకొనినవాడితడే. నిత్యము

దానియింటనే తనదుర్మార్గపుస్నేహబృందముతో చరించుచుం డును. తనకువలయుధన మడిగినప్పుడెల్ల తండ్రియే విధిలేక యిచ్చుచుండును. మద్దిల మాణిక్యము మహాచతురతగలది. వీనిని తనచేతికీలుబొమ్మవలె నాడించి మితిలేని ధనమార్జించు చున్నది. మెరకవీధినిగల వేశ్యలెవరును యీమెకు సరిరారు. ఈమెచేయు దుష్టకార్యములన్నిటికిని జూరత్ లాల్ సహాయము చేయుచుండును. పొరుగూరునుండివచ్చు ధనవంతులగు సరసు లను యింటికి రప్పించి వారినిమూసిచేసి వారిధనమపహరించునని వాడుక. అన్యపురములనుండి సంసారిపిల్లలను దొంగిలించి తెప్పించి వారినిబలవంతముగ తనవృత్తికిదించి ధనమార్జించునట. ఒకనాడు జూరత్ లాల్ తప్పత్రాగివచ్చి యిద్దరునుశయన మందిరమునుజేరిరి. చదువరులారా! ఆశయనమందిరమున దంతముమంచముగలదు. అందుపయి ముఖమల్ పరుపులును, దిక్కెలునుగలవు. చుట్టును దోమతెరవేయుబడినది. గోడలకు నిలువుటద్దము లమర్చబడియున్నవి. మధ్యనొకగుండ్రని మేజా బల్లగలదు. దానిచుట్టును మెత్తని దిండ్లుగల కుర్చీలున్నవి. ఆబల్లపయి గాజుగ్లాసులును, పలురకముల త్రాగుడుపదార్థము లును, ఫలహారములును, తాంబూలాది రసవర్గములును, అనేకములగు సుగంధద్రవ్యములును యున్నవి.

జూరత్ లాల్ మాణిక్యములు జయిలునుండి విడిచివే సినవచ్చినవాడు యెవరోయనియు, వైరివాడయినను చాలతెలి

వికలవాడనియు మాటాడుకొనుచుండిరి. ఇంతలో నాపిచ్చి వాడు వీరిమేడక్రిందినుండి పోవుచుండెను. వీరలువానినిచూచి అదుగో పిచ్చివాడు. అని కేకలువేసిరి. వెఱ్ఱివా డాజూరత్తు లాల్‌ను జూచి "నాయనా భోగముదాసినినమ్మి ఆటలాడుచున్న నీవు వెఱ్ఱివాడవా ? నేను వెఱ్ఱివాడనా ?" క్యారే ఛోటా తుమ్ దివానా. అమ్ దివానా, లోకులుకాకులంటారు కాకులు లోకులంటారు, కాకులికి, లోకులికి యేమిసంబంధముందో చెప్పు బ్రదర్. మనేముండ ఖుదేనా అని యేమేమో అను కొనుచు బోయెను.

---

## తొమ్మిదవ ప్రకరణము

---

### "పురుషుడు స్త్రీయగుట"

పాఠకమహాశయా ! కొండగుహాలలో బంధింపబడిన డిటెక్టివ్ మనకమలాకరునిగతి యేమయినదో తెలిసికొన తొందర నొందుచుంటివా ? ఇదిగో నీకెరుకజేసెదను వినుము. ఆగుహాద్వారముచెంతగల భటుడు హస్తమున నాయుధము ధరించి బహుజాగరూకుడై కావలిగాచుచుండెను. బంధితు డగు కమలాకరుడు నిలచి నిలచి నిద్రాహారములు లేక అలసి కునుకుచు తలవంచెను. ఇంతలో ఆతని శిరమునకు జుట్టబడి యున్న తలగుడ్డ క్రిందబడియెను. ఆ చప్పుడునకు గుహాకావరి

లోనకువచ్చి బంధితుని జూచి అపరిమితాశ్చర్యము నొందు చుండెను. చదువరీ! యేలకో తెలియునా? బంధింప బడి యున్న డిటెక్టివ్ పురుషుడుకాడు. స్త్రీ మరియు కమలా కరుడు కాడు మనకమలయే. ఆహా! యెంతవింత! పురుషున కైనను పట్టుబడక ముప్పుతిప్పలుబెట్టుచున్న హంతకుని బట్టు కొన బయలుదేరిన యొక కాంత—అందునను బాల—నవకో మలసుకుమారి—ఈకోమలిని గాంచిన యేపురుషు డయినను భ్రమింపకపోడు. ద్వారపాలకుడగు ఆమొరటుతురక కమలను గాంచి యిటుల సంభాషింప ప్రారంభించెను.

భ—క్యారె ప్యారీ తుమ్ కోన్.

క—అయ్యా! నేనెవరని అడుగుచుంటివా? నిలచి నిలచి బంధింపబడి అలసియున్న నాకు నోటమాటయినను రాక యున్నది.

భ—క్యాహో నాప్యారీ.

క—అయ్యా! నాకింతకాలమునకు నచ్చినపురుషుడవు దొరికితివి. అందునను మహాత్ముదీయునియందు నాకు మనస్సు యెక్కువ గాన దయయుంచి కట్లు విప్పితివా నిన్ను మనసార కౌగిలించుకొని ముద్దిడవలెనని కోరికయున్నది.

భ—అచ్ఛా నాకి నిక్కాలేసికో. నీకీ పర్వానై.

క—అయ్యా! ధన్యురాలనయితి. దయయుంచి యీ కట్లు విప్పుము.

భ—ఇద్గో విష్ణుతానుసూడు. అని తాడు విప్పెను. కమలనుజూచి యాభటుడు మురిసిపోవుచుండెను. మీదబడి కౌగిలించి ఆమె ముద్దాడుదునని సంతసించుచుండెను. క్యాకం చన్! జాలం క్యా అని అనుచుండెను.

కమల కనులెఱ్ఱజేసి దుర్మార్గుడా! నేను నిన్ను వరింతు నని నమ్మితివా? నామాట కెదురాడిన చంపెదను చూడు మిదిగో పిస్తోలు అని మొలను దాచబడియున్న పిస్తోలు కన పరచి మారుమాటాడక కరవాలము నిటు తెమ్ము. అని వాని చేతగలకత్తి లాగుకొని సమీపముననున్న రాటకు విరచికట్టి వీని నీవిధమున ప్రాణములతో నుంచిన తనగుట్టు వెల్లడగునని తలంచి పిస్తోలుతో కాల్చెను పాప మామూర్ఖుడు "అరే అల్లా! మర్గయారే" అని ఒక కేకవేసి ప్రాణములు విడచెను. మహాశక్తివంతురాలగు కమల తనయుక్తిచే వీని నంత మొం దించినపిదప తిరుగ పురుషునివలె ముస్తాబయి బయటకు బయలు దేరెను.

గుహాద్వారము చెంతకు వచ్చుసరికి కొందరు దొంగలు గుఱ్ఱములపై వచ్చి యీామెను జూచి అడ్డుకొనిరి. గాని కమల వెనుదీయక కత్తి త్రిప్పుచు వారితో నతిఘోరముగ పోరుసలిపి చెదాచెదలగునట్టుల గొట్టి చెంగునయెగిరి వారి గుఱ్ఱములలో నొకదానినెక్కి పరుగిడ జొచ్చెను. కమల యెక్కిన దరబ్బితురగమవుటచే శరవేగమున పోవుచుండెను.

శత్రులంతటితో విరమించక అశ్వారోహణులయి వెంబడించిరి. కమల వెళ్ళివెళ్ళి యొక మహారణ్యము చేరెను. కొంతసేపటి కామెచేతగల కళ్ళెము తెగెను. గాన తురగ మామె స్వాధీనమునలేక దారి తెన్ను జూడక యిష్టానుసార మీడ్చుకొనిపోవుచుండెను. శత్రువులు విడువక వెంబడించుచుండిరి. కమల యధిష్ఠించిన యశ్వ మావిధి మనోవేగమున పోవుచు చిన్న చిన్న గుట్టలు, యేరులు, సెలయేరులు, చెట్లు, చేమలు, పొదలు, తీగెలు దాటి యొక పర్వతశిఖరము చేరి ఆవలకొండకు దాట చెంగున యెగిరి కమలతోబాటు కొండలోయలో తిరుగబడెను. శత్రువులా కొండకొనకు వచ్చి తురగములాపి క్రిందకు గుఱ్ఱముతో పడి దొర్లుకొనిపోవుచున్న కమలనుచూచి వారు క్రిందకు దిగ సాహసింపక శత్రుడగు డిల్లీశ్వరునకు తగినశాస్తి యయినదని సంతసించి అపరిమితానందముతో శత్రుడంత మొందిన వార్త వారి యజమానుని కెరుకసేయ పయనమై పోయిరి.

---

## పదియవ ప్రకరణము

---

### "బాలతాపసి"

ఋతువర్ణనలు గాని, సమయవర్ణనలు గాని యిప్పటి మాచదువరుల కంతరుచింపవని నాకెఱుక. అందులకే నేను

ప్రాతఃకాలమనిగాని దరిద్రదేవిని ద్రోలి కలకలలాడుచు ప్రవేశించుచున్న లక్ష్మివలె చీకటిని బారదోలుచు సర్వజనానందకరమగు దివాకాంత ప్రవేశించుచున్నదనిగాని, తూర్పుదిశ బాలభాను డుదయించుచుండెనని గాని, ప్రజావళి తమతమ కార్యానువర్తులయి బయలుదేరు చుండిరనిగాని, బజారు లన్నియు బహుసొంపుగ సమర్చబడుచున్నవని గాని వ్రాసి మాచదువరుల విసికింప దలచుకొనలేదు. నాడు పర్వత శిఖరమునుండి క్రిందబడిన కమలాకరు డనిపించుకొనుచున్న కమల కించుక గాయములు తగిలినను దైవకృపచే ప్రాణహాని కలుగ లేదు. మెల్లగ లేచి ఆకొండ లోయలోగల జలమించుక పాన మొనర్చి నేడదేరి నడువప్రారంభించెను. గాని ఆదారి యెక్కడకో తెలియదు. ఏమయినను మరియొకమార్గము లేదుగాన ఆదారినే నడక సాగించుచు తనలోతా నిట్లనుకొనుచుండెను.

ప్రభాకరా! నిజముగ నీవె హంతకుడ వయినను గావచ్చును. లేకున్న పడరాని పాట్లుపడి నిన్నా కారాగారమునుండి విడిపించిన నాకు—నీకై తల్లిని గోలుపోయిన నాకు—నీనుండి అనేక ధనవంతులను విసర్జించిన నాకు—నీనుండి మగవేషము ధరించి అఖండ కష్టపరంపరలకు లోనవవలసిన అపరాధపరిశోధకుని పనిలో చేరిన నాకు—తిరుగ నగపడకుందువా? ఛీ! ఛీ! నిన్ను నమ్ముటతప్పు. నీకు మేలొనర్చుట బుద్ధితక్కువ. నిన్ను మోహించుట హీనము. అబ్బా దగ్గరనుండి యెన్నియిచ్చ కము లాడెడి వాడవు?

కమలా—నేనే—నీవు—నీవే—నేను—నీవే నాసర్వము—ఆ సూర్యునకాకమలము—ఈ ప్రభాకరున కీకమల—శరీరములు రెండుగాని ప్రాణములొక్కటియే అని యింకేమేమో భట్రాజువలె జెప్పుచుంటివే ఇపు డాప్రే మేమయినది. ప్రభాకరా! నీకిది న్యాయముకాదుసుమీ. నమ్మినవారిని నాశనముజేయ కూడదు. వలచి వచ్చినకాంతను వద్దనరాదు. ఉపకారి కపకారము సేయకూడదు. అయ్యయ్యో వెర్రినై నాప్రాణప్రియుని నిందించుచుంటిని. నాకై అతడెంత పరితపించుచుండెనో నేపడు పాటు లతని కేమితెలియును. నాడు జెయిలుగవాక్షమున దారి చేసి వచ్చితినిగాని అతనినికలసి మాటాడలేదే. నేనని యెటుల యెరుంగగలడు మాయింటికివచ్చి మాటాడుటకయినను వీలు గాదే, నిజమగు హంతకుండు దొరకువరకును మేమీవిధి నొకరినొకరము కనబడక పరితపించవలసినదే. ఒకవే ళతడే హంతకుడయి యుండడుకదా? అటులయిన యీ వీరన్న యెవరు? ఏమయినను పోలీసువారిచ్చు ఆధరువులను బట్టిచూడ ప్రభాకరుడే హంతకుడని సూచించుచున్నవే—ఇప్పు డీవృథా యోచనలతో ప్రయోజనములేదు. నిజమగు హంతకు డెవరో పట్టి తీరవలయును. ఓ మోహమా! నాపని తీరువరకు దూరమున నుండుము. దయారసమా! నీవిక నన్ను వదలుము. జేలతనమా! నీవు కాసంతాగుము. హృదయమా! ధైర్యము నొందుము. కఠినత్వమా! నీవే సహకారివి. దేహమా! సుఖ

మహేశ్వరుడా ప్రభాకరా! నాతలంపునకు రాకుము. అని మనోనిశ్చయము చేసికొని కమల వెళ్ళి వెళ్ళి యొక మహారణ్యముచేరి నిద్రాహారములు లేకపోవుటచే మూర్ఛితురాలయ్యెను.

ఇంతలో కొందరు మునిబాలకు లాదారినివచ్చి వనకమలాకరునిజూచి యెవరోరాజకుమారుడా యని యూహించి యెవరైననేమి, పాపము! మూర్ఛితుడై యున్నవాడని విచారించి శీతలోదకముల జల్లి తెలివివచ్చునటుల జేసి రాజా! నీవెవరు? ఏల యీలీల యరణ్యముల పాలయితివని ప్రశ్నించిరి. కమల తాను స్త్రీనని వారు తెలిసికొనని నందులకు సంతసించి "అయ్యా! నాగాధ అగాధమయినది. చెప్పుటకయిన శక్తి చాలదు. అన్నపానాదులు లేక కృశించి యున్నవాడను దయయుంచి యించుక ఫలహారములయిన నిచ్చి యీదీనునికి ప్రాణదానము జేయుగోరెదను." అని వాక్రుచ్చెను. అంత నా మునిబాలకులు "రాజా! యీసమీపముననే మాయాశ్రమము గలదు. అచ్చట మాగురువులవారిని కలసికొనిన నీవిపదలును తొలంగగలవు గాన కొంచె మోపికపట్టి రావలయును శక్తిచాలనియెడ మాచేతులపయినెత్తి తీసికొనిపోయెదము" అని పలికిరి. మనడిటెక్టివు "తాపసోత్తములారా! తమకు సేవజేయవలసిన వాడను, మీచే సేవజేయించుకొని పాప మొడిగట్టుగొందునా, తమదయవలన నించుక దారుఢ్యము కలిగినది. తమవెంట నడచివచ్చెదను" అని పలికి వారివెంబ

నాముని యాశ్రమమునకు బయలుదేరెను చదువరీ! యానడి యరణ్యమునగల యాశ్రమ మతివర్ణనాతీతమై యున్నది. తాటి, కొబ్బరి మొదలగు కమ్మలచే నిర్మింపబడి యున్నదా కుటీరము. దానిపై ననేకములగు లత లెగబ్రాకి నల్లిబిల్లిగ నల్లు కొని చిన్నపొదవలె గనబడుచున్నది వాకిట పూజార్హమగు పుష్పములుగల మొక్కలు, మారేడు మొక్కలు, తులసి మొక్కలు మొదలగునవి యున్నవి. చుట్టునుగల బయలం తయు పచ్చనిపసరుతో నిండియుండి కన్నులకొక వింతసొగ సొసర్చుచున్నది అందనేకములగు కురంగములు విహరించు చున్నవి. లోననొక త్రాడుపై మునిబాలకుల కౌపీనము లు అంగీలు ఆరకట్టబడియున్నవి అందుగల బాలతాపసి చుట్టును గల శిష్యులు వేదపఠన మొనర్చుచుండిరి. దర్భాసనముపై గూరుచునియున్న యా బాలతాపసి గోముఖమును తనచే తికి దగిలించి కండ్లు మూసికొని జపమొనర్చుచుండెను. ఆబాల తాపసియొక్క అందమతి వర్ణనార్హమైయున్నది. ఇంతలో మన డిటెక్టివు వచ్చి మహాశ్చర్యానంద భయ వినయములతో ఆ మునికుల తిలకునికి నమస్కరించి నిలచి ఆ పరాత్పరుని దలంచి పరమాత్మా! నీమహిమ లఖండములుగదా? నవకోమల శరీరుడును, సుందరవదనుడును అగు యీ యువ్వనుని జడ వల్కలములను ధరింపజేసి మహావైభవముల వదలి వైరాగ్య మూనజేసి, మహాభోగములకు, సుఖములకు నిలయుంబగు

ప్రపంచమునే రోయునటు లొనర్చి తాపసిని జేసితివి. నీకిది తగదుసుమీ! ప్రభువు తన పరిజనులకు తగుపదవు లొసంగ వలయునుగాని, పిరికివానిని సేనానాయకునిగను, నవయువ్వనుని పూజారిగను, బుద్ధిశూన్యుని ప్రధానునిగను నియమించునా? అని అనుకొనుచుండెను. ఇంతలో నా బాలతాపసి కనులు తెరచి జూచి బాలా కాదు బాలకా! నీ వెవరు? ఏల యీ లీల మహారణ్య మధ్యమునగల యీ స్థలమునకు వచ్చితివి అని పలికెను.

క—అయ్యా! తమవంటి మహాపురుషు లెరుంగజాలని రహస్యములుండునా?

తా—కుమారా! బోధ్యమయినది, నీవు మహాభయంకర కార్యమున బయలు దేరితివి. ఆ హంతకు డతిఘుటికుడు. మహాశూరులకుగూడ అగపిట్టుకొను టసాధ్య మయినది. అందునను నీవు మగవేషమున న్న—

క— తాపసోత్తమా! మీరెరుక జేసినది నిజము. ఏమయి నను హంతకు డెవరో పట్టుకతప్పదు.

తా—సరియే! ఈకొండ కవతల నొకగుహ కలదు. అందు ఆహంతకుని మిత్రుడు గలడు. వా డాహంతకునికి కుడి భుజమువంటివాడు. వాడు తన పరివారములతో వెళ్ళి దుండగములొనర్చినపుడు ముఖములకు ముసుగులు ధరించి యుండును గాన వాడెవరో యెరుంగజాలము.

క—అయ్యా! నేనాతావునకు చేరగల తెరవు జూప ప్రార్థితులు.

తా—సరియే యీ నాశిష్యులు నిన్ను నాకొండపైకి చేర్చెదరు. నీవుకూడ యీకాషాయవస్త్రములను ధరింపుము. నడిదారిని నీ కేచోరులబాధ యుండదు అని పలికి తనశిష్యుని తోడుగా నిచ్చి ఆమెను పంపివేసెను.

---

## పదునొకండవ ప్రకరణము

---

### "దొమ్మరగూడెం"

రాజమహేంద్రవరమునకు సమీపముననే బొమ్మూరను మెట్టయును చిన్నగట్టు గలదు. దానిపై నొక చిన్నగూడెము గలదు. అది దొమ్మరులకు, చెంచులకు నివాసస్థలము. ఇదితరులెవరు నాకొండపయి నివసించరు. తరచు అచటకు పోవువారలు గూడ లేరు. ఆ దొమ్మరి గూడెము గూడ యెపుడును మూయబడియే యుండును. ఎపుడయిన నా గుమ్మములో నొకరిద్దరున్నను తవ్వాలు, అడ్డలు, చేసికొనుటయో, పెనుకుక్రలు సాపుచేసికొనుటయో చేసికొనుచుం దురు. అందుకొందరు దొమ్మరసానులు గలరనియు, వారికొరకు

కొందరు నరసులు మాత్ర మప్పుడప్పు డక్కడకు వెళ్ళుచుందు రనియు వాడుక. ఒకనాడు సంధ్యాసమయమున సూర్యాస్త మయ మయిన కొద్దికాలమునకు యింకను బాగుగా చీకటి పడకమునుపు, చీమలబారువలె బారులుగట్టి వరుసగ నెగురుచు పక్షులన్నియు గగనమార్గమున వెళ్లుచు తమగూండ్ల చేరబోవు చున్న సమయమున కాముకుల పాలిటి కల్పవృక్షమువలె ఆకసమున చంద్రబింబ ముదయించుచుండ నొక వ్యక్తి అశ్వా రోహణుడై కొండపైగల గూడెమును సమీపించుచుండెను. గూడెమునగల దొమ్మరు లావ్యక్తిని గాంచి వీధివాకిటనిలచి వానినెదుర్కొని "దొరగారి కియ్యాల మాపయిన దయగలిగి నది, తమవంటి దొరలు మము జూడకుంటె మాసానుల నేమి చెయ్యాల?" వారితో కలసి గూడెములోనికి వెళ్ళిన మావ్యక్తి యొక నులకమంచముపయి గూర్చుని వారితో నిటుల సంభా షింప ప్రారంభించెను.

వ్య—ఓరీ సానులలో మంచిదానిని నాకేర్పరచుము. నీకు డిగిన ధన మొసంగుచుండెదను.

దొ—చిత్తం బాబయ్యా? మాదొర కూతు రుంది తమకి తగిన కన్నెపిల్ల.

వ్య—మీదొర యెవడురా?

దొ—అరుగో ఆబల్లపయి నున్నారు సూడండి. అని బుగ్గమీసములుగల యొకనల్లని మనుష్యుని గనపరచెను.

వ్యా—ఓరీ ! అతడు మీకులమువాడేనా ?

దొ—కాదండి మాదొమ్మరసాని కొరకొత్తుంటారు. మాదొడ్డదొరండి. మాఅందరం ఆయనకాడె బతుకుతుంటా మండి.

వ్యా—అతడు నిత్య మిక్కడనే యుండునా ?

దొ—రాజమండరాన కూతుతెని బత్తుంటారు.

వ్యా—అచ్చటతని బసయెక్కడ ?

దొ—మాకు తెలదండి.

వ్యా—అతనికేమిపని ?

దొ—ఆయనగారిప్పుడు పడుకొన్నారండి. రాతిరి సాల పొద్దోయింది, ప్రభువారు మాకట్టా సెప్పించి అదిగో ఆ గదిలోకెళ్లి తొంగోండి.

ఆవ్యక్తి అప్పటికా సంభాషణ చాలించి దొమ్మరవా డడిగిన దానికలిచ్చి ఆదొమ్మరసాని గదిలోచేరెను. ఆగది ప్రక్కనే మన బుగమీసముల నల్లపిముష్కరుడు దొమ్మరుల నాయకు డాసీనుడయి యుండెను. చుట్టును దొమ్మరులందరు స్త్రీ పురుష సహితముగా చేరిరి. మధ్యనొక దీప మున్నది. బుడ్లతో సారాయి తెప్పించి తాను త్రాగుచు దొమ్మరుల కిచ్చుచు వినోదించుచుండెను. అగూడెమునకువచ్చిన నూతన సరసుడు తనకును స్త్రీగా యున్నదని చెప్పి తనవద్దనున్న దొమ్మర సానిని బయటకు పంపివేయుటచే అమెకూడ వచ్చి తనబందుగు

లతో చేరి అచట జరుగుచున్న విందున పాల్గొనెను. క్రమక్రమముగ సారాయిమత్తు తలకెక్కుటచే అందఱును మతితప్పి యిట్టుల మాటాడు చుండిరి. దొమ్మరుల నాయకుడగు—అహీరావణుడు ఓరిదొమ్మరులారా! మీరు నాకు ప్రతికార్యమునను దోడై యుండవలయును. దోపిడిలో నేనఖండుడనని మీరెఱుంగుదురుగదా మీరు నావెంట దోడయి వచ్చినచాలు దొరికిన ధనమంతయు మీకె నొసంగెదను.

దొ—దొరగారు మీమహిమ మే మెఱుంగమా?

అ-రా—ఓరీ! నామహిమకేమి నాగురువు నన్ను మించువాడు.

దొ—ఎవరు బాబారు?

అ-రా—ఈమధ్య జరిగిన కూనీ యెఱుగుదువా?

దొ—ఇన్నామండి బాబయ్య.

అ-రా—ఆకూనీచేసిన మహామహుడే?

అని యింకేమేమో మాటాడుకొను చుండిరి. ఈగది ప్రక్కగదిలో ప్రవేశించిన సరసు డామాటలన్నియు ఆలించి నాడు బాలతాపసి చెప్పినవృత్తాంతము నిజము. ఈఅహీరావణుడా హంతకునిమనిషియో హంతకుడో అయియుండవచ్చును. ఈదొమ్మరు లందరు వీనివలన పోషింప బడుచున్నవారలు. దైవకృపచే యీదుర్మార్గుడు నాకంటబడెను. నేవచ్చినపని సమకూడినది. నిష్కారణము ప్రభాకరుడు హంతకుడని తలం

చితిని గాని యింకను నిశ్చయించుటకు వలనుపడదు. ఈ క్రూరుడు పింగురు వింకొకడు గలడనియు వాడే వాంతకుడనియు చెప్పుచుండెనే ? ఒకవేళ పింగురువే ప్రభాకరుడు కాకూడదా ? పీనిని ముందు బంధించిన సర్వమును దెలియగలదు. నేలోపటికి వెళ్ళి పిస్తోలు గనపరచి జడిపించి వానిని బంధించెదను. కాని యీదొమ్మరులందరు తిరుగబడక మానరు. అయినను భయము లేదు. నేను యీల వేయగానే ఆయుధపాణులై వచ్చుటకు కూర్చిబంగళాలో వందమంది రక్షకభటులను సిద్ధపరచి వచ్చితినిగదా ? అని తనలో తాననుకొనుచుండెను. ఈదొమ్మరి సరసుడు మగవేషముననున్న ఆడుదనియూ పత్తేదారగు కమలయే యనియు మూ చదువరులకు చెప్పకయే చెప్పకొన గలరని తలంచెదను. క్షణములో దొమ్మరకూడే మంతయు రణరంగమయ్యెను. కమల చేతపిస్తోలు ధరించి దుర్మార్గులారా ! మీసంగతి బోధపడినది. ఎవరైనను అడుగు కదలిన అంత మొందెదరు జాగ్రత్త. అని పలుకుచుండెను. తప్పత్రాగి చాలవర కాస్త్రీపురుషులందరు స్పృహదప్పి అంతకుముందే నేలబడియుండిరి. అహిరావణుడు, మరి ముగ్గురు దొమ్మరులు మాత్రము తెలివిగనుండిరి.

అ-రా.__ఓరీ ! పత్తేదారువా. నీవును వాంతకుని పట్టు శపథముజేసి బయలుదేరిన కమలాకరుడవా ! నిను పట్టుదలం చియే తిరుగుచుంటిని. నాకు శ్రమలేకుండ నీవే నాకడకు

వచ్చితివా ? నీబెదరింపులు కట్టిపెట్టి ఆ పిస్తోలు క్రిందనుంచి నమస్కరింపుము. లేదా నీపని సరి.

క——ఓరీ ! యీ టక్కరిమాటలకు లెక్కసేయను. అని (యీలవేసెను) అహిరావణుడు మొదలగు వారమాంత ము మీదబడిరి. కమల చేతనున్న పిస్తోలు ఢాం, ఢాం, అని పేల్చెను. దొంగలకు దెబ్బలు తగిలినవి గాని వారు విడువక పోరాడుచుండిరి. కమలచేతగల పిస్తోలులో గుండ్లయిపోయినను జంకక వారితో నతిఘోరముగ పోరు సలుపుచుండెను. ఇంతలో ఆయుధపాణులై రక్షకభటులును, సూపరింటెండెం టును యినస్పెక్టరు మొదలగువారును వచ్చి దొంగ లందరిని అమాంతముపట్టి బేడీలు తగిలించిరి. మన వత్తేదారు హాగా పడిపోయి కోటు వీడిపోయినంతనే పోలీసువారందరు కమలా కరుడే కమలని తెలుసుకొని ఆమె సాహసమున కత్యానందించి శ్లాఘించిరి. వీరందరినిజూచి కమల ఇంచుక సిగ్గునభినయించు చుండెను దొంగలామెనుజూచి దొంగలలో దొంగరా యిది యని యనుకొనుచుండిరి. యింతమందియు ఆడదానిచే మోస గింపబడినందులకు విచారించుచుండిరి. కమల సిగ్గుపడినను లాభము లేదని తలంచి తన దుస్తులను సరిజేసికొని "అయ్యా ! యినస్పెక్టరుగారూ ! వీరందరిని బేడీలు తగిలించి తీసికొనిపోయి బందీకృతులను జేయవలయునని పలికెను. కమలయే కమలా

కరుడని తన నిజవృత్తాంతమంతయు ప్రభుత్వమువారికి కూడ యొక రిపోర్టు వ్రాసిపంపెను.

---

## పండ్రెండవ ప్రకరణము.

---

### "వస్త్రాపహారణము"

ఒకనాడు కమల దానవాయిగుంటలోనున్న తన గృహములో సుఖాసీనయైయుండి బందీకృతుడై యెదుట నిలువబడి యున్న అహిరావణునితో యిట్లు ప్రసంగింప ప్రారంభించెను.

క—ఓరీ! నీ నిజవృత్తాంతమంతయు సవిస్తరముగా జెప్పితివేని నిను క్షమించి విడిపించెదను. నీవెవరు?

అ—అమ్మా! నీసామర్థ్యమునకత్యానందముగా నున్నది. అందులకు చాలసంతసించి సంగతులన్నియు సవిస్తరముగ చెప్పనిశ్చయించితిని. మాది విజయనగరము సమీపములో నున్న ఉమ్మియనుగ్రామము. మేము యెఱ్ఱగొల్లలము. నేను చిన్ననాటినుండి కడుదుర్మార్గుల సహవాసముచేసి పాపభీతి లేక డబ్బుగడించుటయే నాపని. నేను తరచు విజయనగరము వెళ్లుచుండును. ఆచుట్టుప్రక్కలన్ని గ్రామములలోను నాపేరెరుగనివారులేరు. విజయనగరములో నాకొకస్నేహితుడు గలడు. అతనిపేరు. బండవీరన్న. బలపరాక్రమములలో నన్ను మించువాడు. అతనిబస సంతపేటలోగలదు గాని అతడెప్పుడును

యూరాడమెట్టుపై గల బంగళాలో నుండుచుండును. అతడు నన్ను యీగ్రామమునకు వెళ్ళి యచటజరిగిన కూనీసమాచారమునుగురించి యెప్పటికప్పుడు తెలియపరుచుటకును, హంతకుని పట్టు బయలుదేరిన మీము సమయముజూచి పట్టి తనకు వప్పగించుటకును, నియమించి యిచటకుపంపెను. నాకు కావలసిన ధనమంతయు అతడే పంపుచుండును. నే నావనిపయినే యిక్కడ నుండి నాకుసహాకారముకొరకు యీదొమ్మరులను స్నేహము చేసి చరించుచుంటిని. ఇంతకాలము బ్రతికి యింటివెనుక చచ్చినటుల యింతసమర్ధుడనయినను, తుదకు స్త్రీ యగు మీచే ఓడింపబడినందుకు మనసున విరక్తిచెంది యీదుర్మార్గ వృత్తి మానదలంచి నా నిజవృత్తాంతమంతయు తెలియపరచితిని. నీటముంచినను పాలముంచినను మీరే దిక్కనిపలికెను.

క—ఓరీ! నీవు చెప్పినమాటలన్నియు సత్యములని నాకు నమ్మకకలిగినపిదప తప్పక నీకు సహాయమొనర్చెదను అంతవరకుమాత్రము నీవు కారాగృహములోనుండక తప్పదు. అయినను నీచే పనులను చేయించకుండ యుండునటుల మాత్రము చేసెదను. అని కమల రక్షకభటులను పిలచి తిరుగ వీనిని జెయిలునందుంచునటు లాజ్ఞ యొసంగెను.

అహీరావణుడువద్దనుండి వీరన్నకు ఒకజాబు వ్రాయించి తీసికొని పత్తేదారగు కమల పురుషవేషము ధరించి ప్యాసింజరులో బయలుదేరి విజయనగరము వెళ్ళెను.

వెళ్ళెను. రాజమండ్రినుండి పదునొకండు గంటలకు బయలు దేరిన ప్యాసింజరు సుమారు యెనిమిదిగంటలకు వాల్తేరుచేరును. అక్కడనుండి బి. యన్. ఆర్. ప్యాసింజరుపై విజయనగరము వెళ్ళవచ్చును. పురుషవేషము ధరించిన కమల స్టేషనులో దిగి బండిపై బయలుదేరి బండ వీరన్నయింటికి తీసుకవెళ్ళుమని చెప్పెను. చాలరాత్రి యగుటచే వీరన్న యింటివద్దనే యుండెను. కమలనుజూచి వీరన్న అయ్యా! దయచేయండి. తమ రెవరు? ఎచటనుండి యిలా దయచేసినారు?

క—అయ్యా! మాది రాజమహేంద్రవరము. అహి రావణుడుగారు నాకు ప్రాణమిత్రులు. వారివలన మీమహిమ యెరిగి తమను చూడవలెనని కుతూహలముతో యిలావచ్చి నాను. ఆయనకూడ రావలసినదే గాని యూరిలో కొత్తవత్తే దారుపని చాల జోరుగా నున్నది గాన వారు రాలేకపోయిరి. యీ వుత్తరమిచ్చి నన్ను బంపిరి. అని సీలు జేయబడియున్న యొక కవరు త్తరము చేతికిందిచ్చెను.

వీరన్న ఆ కవరందుకొని యిటులు చదువుకొనెను.

"బండ వీరన్నగారికి.

మహాశయా! నమస్కారములు ఈ వుత్తరము తెచ్చిన కమలాకరుడుగారు నాకు ప్రాణసమానులగు మిత్రులు. మనము ప్రతిపాంసమునందును వీరివలననే సహాయ మందు చున్నాము. మన రహస్యములన్ని వీరికి తెలునును. నాకు

సహోయులయియున్న దొమ్మరులందరు వీరితరవువారే. వీరిచట చాల ధనవంతులు, పలుకుబడి కలవారు, మీసంగతి నా వలన విని మిమ్ము చూడగోరుటచే మీకడ కంపితిని. పలువిధ ములః మర్యాదచేసి ఆదరించవలయును. ఒకటి రెండు దినము లలో ఏ త్తేదారు మనచేత పడకమానదు.

చి త్తగించవలెను.
అ. రావణుడు"

వీ—మిత్రరత్నమా! యీ వృత్తరమువలన తమరొన ర్చుచున్న మేలెరింగితిని. ఉపకారమునకు ప్రత్యుపకారము చేయజాలను. తమ దర్శనము లభించుటచే నాకీదినము కడు సుదినమని సంతసించు చుంటిని.

క—అయ్యా! తమరు నన్నంతయెక్కువ జేసినందుల కానందించి అనేక నమస్కృతు లొనర్చుచున్నాను. చాల రాత్రి కావచ్చినది. దయయుంచి నిదురించవలెను.

వీ—అయ్యా! ఇవిగో ఫలహారములు తెప్పించితిని. తమ రించుక భుజించినపిదప యిద్దరమును మేడపై శయ నించెదము.

క—క్షమించవలయును నేను స్టేషనువద్దనే ఫలహార మొనర్చితిని. తమ ఆదరణయే పదివేలు గాని తమరొక యుప కారము చేయవలయును. నే నొరులున్న నిదురపోజాలను. ఒక్కగది ప్రత్యేకించి యివ్వవలయును.

పీ—అయ్యా! తమకేమియు లోపములేదు. మా మేశపయి నెవరును యుండరు. మీరొక్కరు నక్కడ నిదుర పోవచ్చును. ఈక్రిందిగదిలో నేను బరుండెదను. అవసర మయిన కేకవేయవచ్చును. అని పలికి తననౌకరును తోడిచ్చి కమలను లోనకుబంపి తా నొంటరిగ తనగదియం దాసీనుడై యుండి యిట్లు లనుకొనుచుండెను. "ఇతడెవరు? నిజముగ మిత్రుడా? శత్రుడా? శత్రుడే అయిన నాయింటనే బసచేయు నా? అహిరావణుని చేవ్రాలుగలయుత్తర మెట్లుల తేగలుగును? వానిని బట్టుకొని బలవంతముగ పత్తేదారు వ్రాయించి యుండగూడదా? నాకే యేల వ్రాయించవలయును? నా సంగతి యెట్టుల తెలుసుకొన గలిగెను? అహిరావణుడు చెప్పి యుండునా? అతడు శత్రునకు గుట్టుయిచ్చునా? ఇవ్వడు. అట్టివాడుకాడు. ఏమో ధనమున కాశపడి నాగుట్టుయిచ్చి యుండెనేమో? అతడు కోరినపుడెల్ల నేనే ధనమంపుచుంటినే. అతడు నాకిదివర కనేకసారులు తన కొక ప్రియమిత్రుడు గల డని చెప్పుచువచ్చెను గాన యీకమలాకరు డతనిమిత్రుడే అట్లు లనుకొనుటకుకూడ కొన్ని యనుమానము లున్నవి. అహిరావణుడు తనమిత్రుని జూపుటకు తానుకూడ వచ్చును గాని యుత్తరమిచ్చి యేలపంపును? తాను రా వీలులేక పంపియుండగూడదా? ఇన్నిదినములు లేనిది యిపుడేల యీ తొందర వచ్చియుండును? అని యనేక విధము లనుకొను

చుండెను.” ఇంతలో యెవరో వచ్చి తలుపు తట్టెను. వీరన్న వెళ్ళి తలుపు తెరచి ఎదుటనున్న నూతనవ్యక్తితో “అయ్యా! మీరెవరు ?”

వ్యక్తి—నే నేమి చెప్పినను యితరు లుందురేమో అని భయముగా నున్నది. ఈయుత్తరమువలన మీకన్ని సవిస్తరముగ బోధపడగలవు. అని యొక జాబు చేతికిచ్చెను. (అందిటులు వ్రాయబడియున్నది.)

“ మాత్నరత్రమి.

మన—రుదాత్తేప— చింగిసమో — నికొట్టు — నుచేంయు నినివా—చింగినమో—నితిపింకడకమీ— కవదువి — చింధింబ — దుచుంయు— రుదాత్తేప—కబ — దిడఅ—నికా — దువాగమొ — దుకా — రుపే—దురుకలామక—దుకా—లమక—కబ—లుయిజ — రుకనొ—నమ—దుతుహిస్నే—సగా- బుజాయా-పంప - నితిగిలిగ ట్టెబన్నితుశ—నిత్రుమి—పంపిడివి—రుగో—నున్నాను.

ట్లుయి

దుఃణువరా”

“ ఇతరుల కబోధ్యమగు జాబు చూచి వీరన్న తానందలియర్థమును గ్రహించి యానూతన వ్యక్తినాదరించి పరుండబెట్టెను. ఇంతలో తెల్లవారినది. వీరన్నయు మనవత్తేదారగు కమలాకరుడును కాఫీత్రాగి యారాడకొండపైగల వారిబంగాళాకు బయలుదేరిరి. వీరన్న చర్యలే అతికంగారును

ముఖ ప్రతికోపమును సూచించుచున్నవి. త్రుటికాలములో కొండపై గల బంగాళా చేరిరి. లోనగల వీరి సభామందిరమున వీరన్న అనుచరులందరు సుఖాసీనులయి యుండిరి. వారిలో కొందరు ఫకీరులు, కొందరు సన్యాసులు కూడగలరు. వీరన్న యచటగల యున్నతాసన మధిష్ఠించి, మనపత్తేదారు నా ప్రక్క యాసనముపై కూర్చుండుమనెను. పిదపయిటు లా మర్మార్గులు వారిసంభాషణములు చర్చింపప్రారంభించిరి.

వీ—సోదరులారా! యిప్పటికి మనగూఢ సమాచారము లెవరును యెరుంగజాలలేదు. ఇన్ని దినములకోకడు మనల జయింపసమకట్టి తనమాయోపాయము లుపయోగింప ప్రారంభించెను. కాని మనకడ తనయాటలు సాగిరావని యెరుంగజాలకపోయెను. అట్టి మనవిరోధి కెట్టిశిక్ష విధింపవలయునో సభాసదులగు తామెల్లరు యోచింప ప్రార్థితులు.

అల్లాపకీరు—సభాధిపా! మనల ధిక్కరించు సమర్థు లెవరు? యెక్కడ గలరో తెలిపిన మాసామర్థ్య మించుక చవి చూపెదముగాక.

సదానందనాదు—ఏలికా! యీమన విరోధి దొరికిన తక్షణము శిరఃఖండన గావించు టుత్తమము.

వీ—మనవిరోధి నెరింగించెదను. ముందా నూతన వ్యక్తిని బంధింపుడు. అని పురుషవేషమున నున్నకమల నగు వరచెను. ఆమె పరాకుగా నుండుటచే న్యాక్రూరు లామెను బంధించిరి. అయినను ఆమె తన సాహసము కనుపరుప నెంచు

త్నించెను. ఆసందడిలో నామె తలపాగ యూడి పడుటచే స్త్రీ యని స్పష్టమయినది. కాని కార్యములేకపోయినది. బంధితు రాలగు కమలను వారొక రాటకు విరచికట్టి "కాంతా నీవెంత దానవు. మమ్ము మోసగింపదలచితివి గాని నీవే మోసపోయి తివి. ఇప్పటికైన మాసామర్థ్యము బోధపడినదా ? మా అను చరుని బంధించినంతమాత్రమున సర్వమును జయించితినను కొంటివా ? ఇప్పటికైన నామాట విని మాప్రశ్నలకు నిజము పలికితివేని క్షమించి రక్షించెదను" అని వీరన్న పలికెను.

క—ఓసీ ! కల గనినంతమాత్రమున తెల్లవారదు. అయి నను నీ వడుగదలచినదేమో అడుగుము.

వీ—మా అహిరావణు నేలబంధించితివి ? పొరపాటున బట్టుకొనిన విడిచెదవా ? లేదా ?

క—వానిని బట్టుట పొరపాటుగాదు. వాడు నేరి స్థుడు.

వీ—అయినను వానిని విడువవా ?

క—విడువను.

వీ—మాశిక్ష లనుభవింపదలచితివా ?

క—దైవలిఖితమున్న తప్పునా ?

వీ—ఈవేదాంతములేల ! వానిని విడిచెదవా ? లేదా ?

క—ప్రాణమైన విడిచెద గాని చోరుని విడువను.

వీ—ఆడదానవగు నీ కిట్టిపౌరుషము కూడదుసుమా ?

క.—స్త్రీనైననేమి నాది మానవజన్మకాదా?

వి.—ఆడుది మగవానితో పంతగింపవచ్చునా?

క.—న్యాయమైన సంగతి దేవునితోనహితము పంత
గింపవచ్చును.

వి.—చెల్లునా?

క.—ముమ్మాటికిని.

వి.—నీవెట్టి బెట్టుసరిగా పలికినను విన్న గాంచిననుండి
కోపము రాకయున్నది.

క.—మరియేమి వచ్చుచున్నది?

వి.—తాపము.

క.—దుర్మార్గుడా! నీతాప మార్ప నేనీ కాంతనుగాను.

వి.—మరేకాంతవు వేశ్యకాంతవా?

క.—తుచ్ఛుడా! జాగ్రత. నోటికి బుద్ధిచెప్పగలను.

వి.—నా నోటికేల? ఆ కామునికి బుద్ధిచెప్పుము

క.—చాలు నీ యసందర్భ ప్రలాపము లిక మానుము.

వి.—నీవించుక వినిన సందర్భముతే యగును. అని దగ్గర
బోవ కమల కాలితో తన్నెను.

అపు డాక్రూర శిఖామణి మండిపడి "సేవకులారా!
మంచిగ మాటాడినకొలది యీగడ మెచ్చుచున్నది. నన్ను
జయింప త్రినేత్రునికైన నమకూడదని యెరుగుము" అని
భటులపిలచి యీ దుర్మార్గురా లేమిచేయునో చూచెదను.

అరగంటలో నాకొడంబడనియెడల యీమెను వివస్త్రధారిణిని చేయుడని పలికి తన ఆసన మలంకరించెను.

సభలో నెవ్వరు వీనిమాట కెదురాడలేదు. కిరాతుల వంటి యిద్దరు భటు లామెచెంత నిలచి గడువు మించుట కెదురు చూచుచుండిరి.

కడుదీనవదనయైన కమల-ప్రాణభంగమున కయినను భయపడని కమల మానభంగమగునేమో అని జడిసి యీదుర్మార్గుల ప్రతిమాలియైనను వీరిమనసు కరుగునటుల మాటాడి తనకు రానున్న అవమాన మాపుకొనదలంచి పితృసమానులగు నోసభాసములారా! సభాధిపా! సోదరా! మనభారతదేశీయులగు మీారు దేశమాతకు కీర్తి తేవలయును గాని అపకీర్తి దెచ్చుట పాడి గాదు. మనభారతదేశమునకుగల యౌన్నత్యము లడుగంటి నవి నశించినవి ఆరిపోయినవి. అయినను భారతమాత పుత్రికలు కొందరు మహా పతివ్రతలుండి ప్రాణసంరక్షణకన్న మాన సంరక్షణ యెక్కువని చరించుచుండుటచేతను భారతమాత యీకాసంత ఆధిక్యతయినను తనకు గలదుగదా యని బ్రతికీ బ్రతుకనటులు ముక్కుకొనల ప్రాణములుంచుకొని జీవించు చున్నది. ఆమె పుత్రు లెప్పటికైనను నైకమత్యావలంబకు లగుదురా? దేశశేవాధురంధరు లగుదురా? బానిసవృత్తి విము క్తులగుదురా యని యెదురుచూచుచుండ సోదరీలను చెరబట్టి సోదరులకు జంపనుంకించు మిమ్మెగాంచి ఆమె యెంతము

ఖము నొందును. అయిన నిదేటిన్యాయము. నిండోలగమున నొక కాంతనుబట్టి లాగి మానభంగ మొనర్పనుంకించుట న్యాయమా ? ఏమి మాటాడరేమి. నావలుకులు మీకర్ణముల జొరబడుట లేదా ? మీలో నెవ్వరును ఆడబిడ్డలను గన్నమానవులు లేరా ? న్యాయాన్యాయవిమర్శనా సమర్థులు లేరా ? అయ్యయో! మాటాడరేమి? కఱ్ఱబొమ్మలవలె కదలక కూర్చొనుటయే మీకర్తవ్యమా ? అమాయకురాలగు నొకకాంత, సాధ్వి, పతివ్రత - సభామధ్యమున నవమానింపబడుచున్న జూచి సంతసింపదలంచితిరా ? మీకను లాలుచిప్పలా? హృదయములు పాషాణనిర్మితములా ? మనస్సులు విషపూరితములా ? న్యాయమాలోచించి యిదమిత్థమని చెప్పి మీలో మీరాదుండగము లాపుకొనజాలనపుడు యితరుల జయించగలరా ? అందరు పిరికిపందలేనా ? ఒక కాంతమానము కాపాడ గలసమర్థులు లేరా ? ఇదిగో నాప్రతిన వినుడు. భూమ్యాకాశము లేకమైనను సరియే. గిరులు గిరగిర తిరిగి మీదపడినను సరియే. నన్ను ముక్కలుగ నఱికి పక్షుల కెరవేసినను సరియే. భాను డాపశ్చిమదిశ నుదయించినను సరియే. మీ మాటల కంగీకరింపను. దైవచిత్తమెటులో అటులగును. అనిపలికెను.

క్రూరుడగువీరన్న చివాలున పీఠము దిగి అనుచితగల భటుల పిలచి ఓరీ! చూచెదరేమి. గడువు మించినది. ఇంత వర కీమేమేమిదియో పోది చదివినది. ఆమెకు బాగుపడు

యోగము లేదు. నేను నామాట నిలుపుకొనక మాననని యెఱుంగదు. ఆకట్లువిప్పి తక్షణ మామెవస్త్రము లూడదీయుడు. అని పలికెను.

భటు లాకమలకట్లు విప్పి ఆమెధరించినబట్ట లూడదీయ బోవుచుండిరి. అసహాయురాలగు కమల దైవమును ధ్యానించుచు ఒంటిపై చైతన్యముతప్పి యున్మాదినివలె అల్లరిచేయుచు యీక్రూరులు చెంతజేరకుండ కాలుచేతుల దన్నుకొనుచు మానసంరక్షణార్థమయి అవస్థపడుచు మరణవేదన మొందుచున్నది.

---

## పదమూడవ ప్రకరణము.

---

### “ఆపదోద్ధారణ”

దుష్టశిక్షణ, శిష్టరక్షణచేయుటకే భగవంతు డవతారము లెత్తుచుండునట. శ్రీమన్నారాయణుడు, ప్రహ్లాదునిగాచి వానితండ్రినిజంప నరసింహావతార మెత్తెను. రావణుని దండింప రాముడై వెలసెను. మోహినియై భస్మాసురుని జంపెను. శ్రీకృష్ణుడై ద్రౌపదీమానసంరక్షణ జేసెనుగదా ? నన్ను మాత్ర మాపరాత్పరుడు గాచి రక్షింపడా ? యని మన కథానాయకి యగు కమల తలచుచుండెను. ఇంతలో ఢాం, ఢాం మనిశబ్దము వినంబడెను. ఈమెచీరెలాగుచున్న యిద్దరుభటులును క్రింద

బడిరి. ఎక్కడనుండియో యొక మనుష్యు డచటకరుదెంచి దా నెరింగిన వశీకరణ మంత్రప్రభావమున వీరందరిని స్మృతితప్పి పడునట్లొనర్చి కమలను గాంచి బయటగల యొక మోటారు నెక్కి. వీరన్న మొదలగు క్రూరులందరి నందు కట్టిపడవేసి పోలీసుఠాణాకు దీసికొనిపోవుచు తనకు సహాయముచేసిన యీత డెవరాఅనియు, ఏల సహాయము చేసియుండవలెననియు, పోల్చుకొనుటకై నను ముఖమున ముసుగువేయబడి యున్నదనియు, నెవరో యెటుల తెలుసుకొనవలెననియు, ననుకొను చుండెను. ఇంతలో పోలీసుఠాణాకుచేరి మోటారునాపి అచట గల యజమానులకు తానెవరో యెరిగించి, యీ బండియందుగల క్రూరుల కారాగృహమందుంచ నాజ్ఞాపించి అందులకు కారణ మంతయు వారలకు సవిస్తరముగ తెలియపరచెను. పిదప కమల తిరుగ పురుషవేషమును ధరించి కొందరు పోలీసువారిని సహాయము తీసికొని వీరన్నయిల్లు సోదాచేయుటకు వెళ్ళెను. వీరన్న యింటిలోచేరి కొందరు తగు మనుష్యులతోచేరి పరిశోధించెను. ఎచ్చటను వీరికేసున కనుకూలమైన వస్తువులేవియు కనబడలేదు. వాని స్త్రీల నెంత జడిపించినను వారికేమియు తెలియదని పలికిరి. అక్కడనుండి వారందరును కొండపైనున్న వీరన్న గూడెమును పరీక్షించ బయలుదేరిరి.

అక్కడగూడ నేమియు కనబడలేదు గాని ప్రాతయుత్తర మొకటి మాత్రము దొరికెను. కమలాకరు డదిచూచి యిటుల చదువ ప్రారంభించెను.

"ప్రియమిత్రులగు వీరన్నగారికి—

హత్యజరిగిపోయినది. శవముకూడ పోలీసువారికందిపోయినది. హంతకుని పట్టుకొనవారు బయలుదేరెదరు. ఇక ముందు భారముమీది. మీ ధైర్యము చూచుకొనియే యీ సాహస మొనర్చితిని.

ఇట్లు,
మిత్రులు"

కమల యీ యుత్తరసమాచారములు చూచి వీరన్న హంతకుడు గాడనియు, యీ యుత్తరమునందుగల వ్రేలిముద్ర యెవరిదో తెలిసికొన ప్రయత్నింప వలయుననియు దలంచి యెవరి దీవ్రేలిముద్ర, యెందుకు వేయబడి యున్నది. ఈ వుత్తరమున యెవరిసంతకమును లేదు. సంతకమే చేయనివారు వ్రేలిముద్ర వేయుదురా? యీముద్ర వుత్తరమున కెడమవయిపునగదా యున్నది. ఈ లేఖరివ్రేలికి శిరా అంటుకొని యుండును. అతడది చూచుకొనక కాగితము పట్టుకొని యుండును. అపుడే ముద్రపడి యుండవచ్చును. ఏమయినను యిది మనకొక ఆధరవు. అని తలంచి ఆయుత్తరమును భద్రపరచెను. ఇంతలో ఢాం మని యొకశబ్దమయినది. నూపరింటెండెంటు, యినస్పెక్టరుగార్లును కమలయు నివ్వెరపడి చూచుచుండిరి. ఇంతలో గుభీమని యొక యినుపచిక్కము వచ్చివారిని చుట్టివేసినది. వారెటును కదలలేక చూచుచుండిరి.

తిరుగ మళ్ళీ పెద్దచప్పుడయినది ఆ చప్పుడుతో కమల మొదలగువారున్నచోట నొకగొయ్యి పడినది. అందులో వారు పడిరి. ఆగొయ్యి అనేకనిలువులు లోతుగనున్నది. కమల మొదలగువార లాశ్చర్యపడుచు చూచుచుండిరి. ఇంతలో ఆనూతికొకమూలనుండి గొప్ప నీటిప్రవాహము పడుచున్నది. క్రమక్రమముగ నూయి నిండుచున్నది. కమల మొదలగు వారు యీదుటకయినను వీలులేక యిరుపచిక్కములో పడియుండిరి. నిలుచబడి దైవధ్యానము చేయుచుండిరి. నీరు పీకలవరకు వచ్చినది. క్రమక్రమముగ హెచ్చగుచున్నది. దైవచిత్త మెటులున్నదో తెలియదు.

---

## పదునాల్గవ ప్రకరణము.

---

### "చిత్రపటసందర్శనము"

వీరపురుషా! నవకోమలశరీరా! సుందరవదనారవిందా! చాలదినములనుండి మీదర్శనభాగ్యము లేకపోయినను యీ మీచిత్రపటసందర్శనమునకై నను కొంత యూరట చెంద గలుగుచుంటిని. ఓయీ నేనెవ్వరో జ్ఞాపకమున్నదా? కల నయిన తలంచుచుంటివా? నీపై నాకు గలిగిన అనురాగము తెలిసికొనగలిగితివా? ఏవనిత - యేహరిణేక్షణ - యేనిర్మల

హృదయ మెట్టి పరితపించుచున్నదో తెలియునా? హృదయమా! మందమతివి గాకుము. మోహమా! దూరముననుండుము. వివేకమా! తలయెత్తుము. నీవికై ఆ క్రూరస్వభావచంచల హృదయునికై - విశ్వాసహీనునకై - మానాభిమాన శూన్యునికై - ప్రేమరహితునికై - నేను పడరానియిడుములు పడుచుంటినిగాని వానికినాతలంపు గలదా? ఈప్రభాకరునికన్న పాపమా బాలతాపసిమేలు. అతడెవరో ఆకునుగుమనిషి మేలు అతడు మొన్న వీరన్న గూడెమున నూతబడిమునిగి చావుసమయము సమీపించినపుడుగూడవచ్చి మాఅందరిని రక్షించెను. నావలన తనకేమి ప్రత్యుపకారమున్నది? అతడెవరో యెరుంగనైన నెరుంగనే! అట్టితడు చిన్ననాటనుండి మాయింట పెరిగి, మాఅన్నముదిని, మావలన విద్యావంతుడై, నామనసు స్వాధీనముచేసికొని, నన్ను దాసీనిచేసికొని, యొకప్పుడు కనబడ నయినకనబడడు. చాటుగరానయినరాడు. జాబయినవ్రాయడు. "కమలా! నేను క్షేమము. నీక్షేమమువ్రాయి" అని యీరెండు ముక్కలు వ్రాసియుండిన నేనెంతసంతసించియుందును. ప్రభాకరుడు విశ్వాసహీనుడు. అటులేలచేయును. ఏమయినను యోచనలతో ప్రయోజనమేమి. అని తలంచుచుండెను. ఇంతలో టపా వచ్చినది అందొక యుత్తరమున నిటులు వ్రాయబడియున్నది.

" పత్తేదారిణీ !

నీప్రియుడు ప్రభాకరుడు విజయనగరములో కంటోన్మెంటులో మాయావతిమేడలో బందీకృతుడయి యున్నాడని తెలియవచ్చినది నీకు తెలియుటకీయుత్తరము వ్రాయడ మయినది.

ఇట్లు,
నీ హి తు డు."

ఈజాబు చూచి కమల యిదియెవరు వ్రాసియుండవచ్చును ! నాహితుడే అయిన స్వయముగవచ్చి చెప్పియుండునే ! ఒకవేళ ఆమనుగుమాపిషి అయియుండునా ? అతడే అయిన ముఖము కనపర్చుటకుగాక ముందునకువచ్చి చెప్పును. ఎవరేయిననేమి స్వయముగ వెళ్ళి యా మాయావతి మహాలుజూచి నాప్రాణప్రియుని జాడతెలిసి వచ్చెదను. అందులకీ వేషము పనికిరాదు. పురుషవేషము ధరించవలయును. సరసుని భంగి బయులుదేరవలయును. పోలీసుకుమ్మక్కు కూడ నుండవలయును ఇక జాగుచేయుటయేల నని లోనకుబోయెను.

విజయనగరమున కంటోన్మెంటులోగల మాయావతి యొక్క భవనమే మాయామహాల్. దానిని గురించి ప్రజలనేకవిధముల చెప్పుకొనెడివారు. ఆ మాయామహాల్‌నకు చుట్టు గొప్పప్రాకారము గలదు. అందు ననేకములగు చెట్లు, చామలు, మొక్కలు, లెక్కకు మిక్కుటముగనున్ని గలవు.

భవనమంతయును విద్యుచ్ఛక్తిప్రభావమున దీపములును, గాలి పంకాలును, మెట్లులేకయే మేడలెక్కుటకు వీలగుయంత్రములు యింకను ననేక చిత్రవిచిత్రము లున్నవని గొప్ప వాడుక. మాయావతి యుత్తరువులేనిది యెవరును లోనకు రాగూడదట. ఆమె నుంచుకొనవలెనన్న యెంతధనవంతుడయినను లెక్కసేయదట, గాని యీమెకు తెల్లవారులోపున మాటలాడించగల సమర్థుడే లోనకు వెళ్ళవలయునట. అటు లోడినవాడు వాని సర్వసంపదలును ఆమెకిచ్చి ఆమెవద్ద యావజ్జీవము బానినగా నుండవలయునట. ఈసంగతులన్నియు నొక బల్లపై వ్రాసి ఆమె మహల్ముందు ద్వారమున గట్టెనట. అచ్చటకువచ్చిన ప్రతిసరసుడు ఆబల్లపై సంగతులు జూచి బెంగపడి వెళ్ళుటయో, లోనకువెళ్ళి భంగపడుటయో జరుగుచుండెనట.

ఇంతలో నొకవ్యక్తి ఆబల్లకడ నిలచి యిటు లనుకొనుచుండెను. "ఓసీ! భోగముదానిదా బోర్డు. వహవా! కాల మహిమ. వకీలుకుబోర్డు, వైద్యునికిబోర్డు, వారకాంతకుబోర్డు. తెల్లవారేలోగా దీనిని మాటలాడించాలా? లేకపోతే వోడిపోయినట్లే? ఏమియెత్తువేసిందిరా ముండ. ఊరకున్నవాళ్ళని మాటలాడించగలరా? మాటాడేవారిని వూరుకోపెట్టగలరా? ఎందుకో యీ అన్యాయాలు యిలాచేరేరు? బోగందానిబోర్డు చదువుచున్నాననా నరేకాని యీవాళ పార్కులో సభజరు

గుతుంది. ఆసభలో నే నుపన్యసిస్తాను. మీరంతా రండి. ఏమి అలావస్తారా? ఇదిగో నేవెళ్ళుతున్నాను. అని ఆవ్యక్తి యేమే మో వెర్రి మొర్రి మాటలాడుచు పోవుచుండెను. పిదప త్రుటికాలములో నొక యువకు డశ్వారోహణుడై వచ్చి గుఱ్ఱము దిగి అక్కడగల బల్లపై నున్న సంగతులు చదివి సమీపమున నున్న ఘంటా మ్రోగించెను. ఇంతలో నొక దూతిక వచ్చి "బాబు బల్లపై సంగతులన్నియు బాగుగ చదివితివా? ఎందుకు నాయనా! యీఆశ! రాజాధిరాజులు వచ్చి మా యేలికయింట బానిసలై యున్నారు. నీవుమాత్రము జయించగలవా?" "అవ్వా! ఆమాటలన్నియు నావలజూచికొందము. లోనకు పద యని పలికెను. అంత యాముదుసలి యొకమాట నొక్కసరికి విచిత్రముగ తలుపు తెరువబడెను. ఆదారిని వారు పోయి యొక హాలుఁజేరిరి. అందు చుట్టును పంజరములలో పలురకముల పక్షులుంచబడి యున్నవి. చిలుకలు, బంగాళా మైనలు మానవులవలె మాటాడుచున్నవి. ఆవెనుక అద్దముల గదిగలదు. అందు యెటుజూచినను ద్వారములున్నట్టులును, మనుష్యులున్నట్లును అక్కడ అమర్చబడియున్న నిలువుటద్దములలో గనబడుచు చూపరుల తబ్బిబ్బొనర్చుచున్నవి. ఆ వెనుక మధ్య మండువాగలదు. దానిచుట్టు పెద్దగోలెములలో మంచినీళ్ళ చెట్లును, రబ్బరుచెట్లును, పంచరంగుల పూలచెట్లును మొదలగు వింతమొక్కలున్నవి. ఇతని వెంటవచ్చిన

దూరిక యేమయినదో కనబడలేదు. అయినను ఆవ్యక్తి భయమునొందక మందువాదాటి మరియొక గదిలో ప్రవేశించెను. ఆగది వర్ణింపనలవిగాదు. ఆగదియం దెబుసూచిరను ముత్తెముల సరులు వ్రేలాడగట్టబడి యున్నవి. వాలుషేప్లు గుల్లోబులు రంగురంగులవి గలవు. విద్యుచ్ఛక్తి దీపముల గుత్తులకు లెక్కయే లేదు. ఇవన్నియును జూచి యిది స్వర్గమా! భూలోకమా! యని భ్రమపడి నిర్వారపడుచు మన వ్యక్తి యిందెవరైన జనులు గలరా? లేరా? ఎక్కడను యెవ్వరు జాడలేరే? అని అనుకొనుచు అక్కడ గోడకమర్చబడియున్న యొకమీట నొక్కెను. తక్షణమే ధాం మని శబ్దమైనది. ఇంతలో గది పైభాగమునుండి నలువురు కాంతలు పాడుచు దిగి నృత్యము చేయుచుం[illegible]రి. ఇంతలో నెచ్చటనో ఘణఘణ గంట మ్రోగినది. [illegible]ట నృత్యముచేయుచున్న కాంతలు యథానిధిని వెళ్ళి [illegible]యు[illegible]రి. ఆచోటు దాటి వెళ్ళిన నొక కొలనుగలదు. అందమ[illegible]బడియున్న అవుతుఖానానుండి జలము పైకి యెగయుచు [illegible]గసాగుచున్నది.

[illegible] స్త్రీలా కొలను సమీపించిరి. అందరును [illegible] యని చెప్పవచ్చును గాని వారందరిలో నొక [illegible]చిన పట్టుపీతాంబరములు, వజ్రవైడూర్యము [illegible] ఆభరణములు, ముత్తెముల సరులు జూచిన ఆమె [illegible]లధికారిణియని చెప్పకయే తెలిసికొనవచ్చును

యున్న తురాయి తలను ధరింప నదివయ్యారముగ వంగి యుండ మెల్లన హంసవలె నడచుచు నామె దర్బారు మహాల్ చేరి. ఆమెకై యమర్చబడియున్న అగ్రాసన మధిష్ఠించెను

ఆ సభ నలంకరించి యున్న సేవకులు మొదలు సభ్యులు సహితము అందరును స్త్రీలుగాని మచ్చునకైనను పురుషులు లేరు. చదువరులారా! కాలవిపరీత మెటుల మారుచున్నదో చూచితిరా? కళ్లు నులిమికొనుచు కాళ్ళుచాచుకొని వంట పొయ్యికడ నుండవలసిన స్త్రీలకు అగ్రాసనాధిపత్యమా! రాజ్య పూజ్యమా! మగవాని ప్రోల నిలుచుటకయినను నశంక వలసిన స్త్రీలు మగవానినయిన శిక్షింప నుంకించుటయా? భర్త సేవయయినను తిన్నగ చేయజాలని స్త్రీలు దేశసేవజేయు నాయకులమని బయలుదేరుటయా? ఏమయినను వారి గొడవ యిప్పుడు మనకేల. కథాంశమునకు బోవుదము.

అగ్రాసన మధిష్ఠించిన మాయావతి బందీకృతుడై యున్న పురుషుని తనవద్ద నిలపమని వానిని జూచి నివ్వెరపడి ఆహా! యితడెవరు నరుడా? కిన్నరుడా? లేక నాకు మంగులు గొలప నవతరించిన మన్మథుడా? ఏమి యీ కన్నులతీరు! సంపెంగ పూవువలె నున్న యీనాశిక యెంత రమణీయముగ నున్నది! అని యేమేమో వర్ణించుచు తనకుగల మమకారము నాపుకొని పురుషాగ్రేసరా! నీవేల యీలీల మామహాలు చేరితివి?

పు.—నీవేల బయట బల్లకట్టి యుంటివి ?

మా.—ఓహో! సరసాగ్రేసరుడువా?

పు.—కాకూడదా.

మా.—బల్లపై నగల సంగతులన్నియు బాగుగ చదివితివా? భటులారా! వానిని బంధవిముక్తుని జేసి యుచితాసనము నలంకరింప జేయుడు.

సరసాగ్రేసరా! రాత్రి కావచ్చినది. ఇక మీరు నన్ను మాటాడింప ప్రయత్నించ గోరెదను.

చాలసేపటివరకు కాపురుషు డెన్నివిధముల యత్నించినను లాభము లేకపోయినది. అంత నతడు సభాసదుల నుద్దేశించి మాయావతి మాటాడదు. మనలకు నిద్దుర రాదు. తెల్లవారుట లేదు. గాన నేనొక కథచెప్పెద వినుడు. పూర్వమొకప్పు డొక దర్జీయును, ఒక వడ్రంగియు, ఒక కంసాలియు, ఒక బ్రాహ్మణుడు గలసి దేశసంచారము చేసి చాల ధనమార్జించి యిండ్లకు తిరిగి వచ్చుచు నడిదారిని రాత్రి యగుటంజేసి ధనముతో ప్రయాణముచేయ సాహసింపక యొక సత్రమున బసచేసిరి. అప్పుడయినను నిదిరించిన చోరులు ధన మపహరింతు రను భయంబున ఆనలుగురు మిత్రులు రాత్రి నాలుగు జాములును మేలుకొనియుండి ధనము కాపాడుకొన నేర్పరచుకొనిరి. వారి యేర్పాటులో తొలిజామున వడ్రంగివంతు పడినది గాన తక్కినవా రందరు నిదురించు చుండిరి. వడ్రంగి మాత్రము

మేల్కొనియుండి పనిలేక కూర్చునియున్న నిదురవచ్చు నను భయంబున తన బుద్ధికుశలతను ప్రయోగించి అందమైన స్త్రీప్రతిమ నొక కర్రబొమ్మను చెక్కెను. ఇంతలో రెండవ వారివంతు వచ్చుటచే దర్జీ మేలుకొని వడ్రంగిని పరుండ నియమించెను. అతడా బొమ్మను గాంచి తనబుద్ధి నుపయోగించి ఆబొమ్మ కతి అందముగా బట్టలు ధరింపజేసెను పిదప కంసాలి నగలుచేసెను. బ్రాహ్మణుడు తన తపఃప్రభావమున ఆబొమ్మకు ప్రాణముపోసెను. నలుగురును ఆమెను పెండ్లాడ తగవులాడు చుండిరి గాని న్యాయముగ ఆనలుగురిలో నెవరు పెండ్లాడ వలయునో చెప్పగోరెదను. మీచేతగానియెడల మీ రోటమి చెప్పినను సరియే అని పలికెను. వడ్రంగియని కొందరు, దర్జీ యని కొందరు, కంసాలియని కొందరు, బ్రాహ్మణుడని కొందరు అందరు అన్ని తెరంగుల జెప్పిరి. ఆకథ విక్రమార్క మునకు మాయావతి సంతసించి తాను జవాబుచెప్పి మెప్పొంద వలెనని తలంచి మాటాడిన పందెముపోవునని మరచి ఆ మెను పెండ్లాడ కంసాలియే అర్హుడని పలికెను. ఆకథ జెప్పిన పురు షుడు నీపందె మోడితివి. అని పలికెను. ఓడిపోయినను సరియే. నేజెప్పినమాట సమర్థించెదనువినుం. "బొమ్మనుచేసిన వడ్రంగి తండ్రివంటి వాడున్ను, బట్టలు యిచ్చిన దర్జీ సోదరునితో సమానుడును, ప్రాణముపోసిన బ్రాహ్మణుడు దైవసము డును, భర్తయే నగలీయవలసినవాడు గనుక నగలు చేసిన

కొంపాలియో భర్తకావలయును" అని చెప్పి అందరిని అంగీక రింపజేసి సభచాలించి తననోడించిన ప్రియునితో గలసి శయ నాగారమునకు పోయెను. గాన చదువరులారా! ఆమెనోడిం చిన అనూతనపురుషుడెవరో యెరుగుదురా? పురుషవేషము న నున్న కమలయే. గాన, ముందుజరుగబోవు సరసల్లాపముల రంగము చూడదగినది గాన మనమూ తావు చేరుదమురండు. మాయావతియొక్క శయనాగార మతిసొంపుగ నలంకరింప బడి యున్నది. మాయావతి కూర్చునియున్న సోఫాకెదురుగ వేయబడియున్న కుర్చీపైన మగవేషమునున్న కమలకూర్చొని యున్నది. మాయావతి మాణిక్యమని కమల గ్రహించి మంచి మాటలవలన కూసీసమాచారము లడిగి తెలుసుకొని నిటుల సంభాషింప ప్రారంభించినది.

క—సుందరీ! నాపుణ్యము నేటికి ఫలించినదిసుమా?

మా—ఏల యిటులనుచుండిరి?

క—వేనకువేలు రాజధిరాజులకైనను జయింపబడని నీవు నాకు ఓడుటచేతను.

మా—నామనోరంజకులగు మీరు లభించుటచే నాకును అటులేయున్నది

క—కాంతా! ప్రయాణపు బడలికవలన చాలబడలి కగ నున్నది. నే డిక శయనింప గోరెదను.

మా—నా ప్రతిన ప్రకారము నన్ను మీరు జయించి తిరి గాన మీరే నాభర్త. అందువలన మనమిరువురము నీ శయ్యయందే శయనింపవచ్చును.

క—కామినీ! నీవటు లనవలదు. నే నేకపత్నీవ్రతి ష్ఠుడను.

మా—నవయవ్వనుల మగు మనలకు కామశాస్త్ర విమర్శనము తప్ప తదితరశాస్త్రావలోకనము జరూరు లేదు. నాడు తార చంద్రునికి జెప్పిన తెరంగెరుంగరా! "అన్యాస్త్రీ ఫలవాటుజూచి" అను పద్యమును జ్ఞప్తికి దెచ్చుకొనుము.

క—కాంతా! అంతటి చంద్రునికిగూడ పరకాంతాప భోగమువలన గలిగిన కళంకము పోలేదు సుమా!

మా—అయ్యో! నావంటి నవయవ్వనిని—రూపలా వణ్యశీలాశిపిని—కోమలాంగిని వలదనుటకు యేపురుషునకైన తరంబగునా? మీరిటులనుటకు నోరెటులవచ్చినది. పురుషులు గారా? యవ్వనము లేదా?

క—కామినీ! నీ వేమనికొనినను సరియే, పోవి నే పురుషుడనుగాను. స్త్రీని. సరియా?

మా—నాథా! కోపముగలిగినదా? క్షమింపుడు.

క—ఆమాటయే మానుమని కోరుచున్నది.

మా—తమదయ. ఇకపోని ఈ మిఠాయించుక ఫలా హారము చేయుమని నాకోరిక. అదియయిన దయయుంచి భుజించెదరా?

మగవేషముననున్న మన పతివ్రతారత్నమని యెరుగక అది యందుకొని పరిశీలించి "ఓసీ పిశాచిక్రూరురాలా! నన్ను చంప యింకను విషము కలిపితివా? యేమనుచుంటివి? లేదనుచుం టివా? దురాత్మురాలా! అట్లైన యీఫలములోనిదే నీవు భుజింపుము. ఏమి భుజింపవేమి భయము నొందుచుంటివేల? దురాత్మురాలా! నిజము చెప్పుము లేదా యిదిగో పిస్తోలు పేల్చి చంపెదను జాగ్రత?" అని పలికెను.

అంత మాయావతి మండిపడి కనులెఱ్ఱజేసి ఒక యీల వేసెను. త్రుటికాలములో ఆమె భటులువచ్చి పట్టుకొనిరి. అక్కడనే ఒక స్తంభమునకు విరిచిగట్టించి "ఓసీ జిత్తులమారి కమలా! పతివ్రతారత్నమా! నీమాయ లెరుంగజాలనంతటి బేలను గాను సుమీ నేను మాణిక్యమునని తెలిసికొనియే నీవు వచ్చి తివి. నిన్ను గ్రహించియే ఓడి నిన్ను గుర్తించనటులు నటించి మంచిమాటలాడి వంచించి చంపి నీపీడ వదల్చుకొన జూచి తిని గాని నిన్నావిధి సునాయాసముగ చంపుట యోచనీయము గాదు. కొంతకాలము నాపేరు తలంచుకొనుచు బాధపడి నిదుర నాహారములు లేక కృశించి చచ్చునటుల జేసెదను. భటు లారా! కొలిమిలో రెండు యినుపయూచలు గాల్చి తెచ్చి ఆ నీచురాలి కనులలో బొడువుడు" అని పలికెను.

చదువరులారా! మన కమలకు నెట్టిగతి ప్రాప్తించి నదో చూచితిరా? గాని మనమేమి చేయగలము. దుష్టులగు

ఆమె భటులు యెఱ్ఱగా కాలి కణకణలాడుచున్న యినుప యూచలు రెండు తెచ్చి కట్టబడియున్న కమల కనులలో బెట్టబోవుచుండిరి.

---

## పదునాఱవ ప్రకరణము

---

### "వెఱ్ఱివాని సభ"

ప్రతిపురమునందును తరచుగ నందం దక్కడక్కడ విశాలమగు బయలులు, పురమందిరములు, ఉద్యానవనములు, పఠనమందిరములు, సమాజములు నుండును. పురవాసులు వారివారి విశ్రాంతిసమయములం దాయాస్థలములకు వెళ్ళి యెవరికిచ్చవచ్చినరీతి వారు వినోదించుచుందురు. ఆవిధముగనే విజయనగరపురమధ్యమున పార్కుగలదు. చాలమంది పురవాసు లందరు ఆపార్కునకువచ్చి సాయంసమయములందు కాలము వెళ్లబుచ్చుదురు గాన అక్కడజేరిన పురజను లందరు మన వెఱ్ఱి వాని నెరింగియోయెుంగకనో వానిచుట్టునుజేరి కూర్చొనియుం డిరి. అతడీవిధి నుపన్యసించుచుండెను, "సోదరీమణులు గూడ గలరా? అబ్బే లేరు. ఒక్కసోదరులే. సోదరులంటే అన్న దమ్ములు. అన్నదమ్ములంటె బ్రదర్సు మీారంతా నేనొక లెక్చరు యిస్తాను. అది వినాలి లెక్చరంటే ఉపన్యాసము.

ఈ మధ్య ఇంగ్లీషులోబడి తెలుగు మరచిపోతున్నాను. "మానవులమగు మనకు ఐకమత్యము లేక కొందరు ఒకరి కొకరు విరోధులై యెట్టి అపకారము చేయుచుండిరి. ఎట్టి హత్యలు జేయుచుండిరి. ఎట్టిహాని చేయుచుండిరి. ఎట్టి దోపిడీలు జేయుచుండిరి. ఎట్టి దొంగతనములు జేయుచుండిరి. అయ్యయ్యో! తుదకు జంతుజాతిలోసహితము, పశుజాతిలో సహితము యిట్టి విరుద్ధము లేదే. పులి పులిని జంపదు సింహము సింహమును జంపదు. పశువు పశువును జంపదు. కుక్క కుక్కను జంపదు. పిల్లి పిల్లిని జంపదు. ఎలుక ఎలుకనుజంపదు అట్టితరి మానవులమగు మనలో నిట్టి విపరీతములు. జ్ఞానవంతులమగు మనలోన నిట్టిఘోరములు. ఇప్పుడు యీ పురమున నొక క్రూరకృత్యము జరుగుచున్నది. నాతో వచ్చిన మీకందఱి కాస్థలము జూపెదను. పౌరుషవంతులైన లెండి, నాతో బయలుదేరి రండి, మీరు రాకపోయిన నేను వెళ్ళక మానను" అని ఉపన్యాసపీఠమునుండి ఊరికి పరుగిడుచుండెను. కొందరు జనులు వెంట పరుగిడుచుండిరి. కొందరు వెర్రివాని మాట లెక్కయేమి అనుకొనుచు వెనుకకు తగ్గుచుండిరి. వీధులంట వీరి పరుగులచూచి ఏమో తెలుసుకొన మరికొందరు బయలుదేరుచుండిరి. ఆవిధి వెఱ్ఱివానివెంట వందలకొలది జనము పెరుగుచుండిరి. గాని తగ్గుటలేదు. రక్షకభటులు, వారి అధికారులు, ఈ యుదంత మెరింగి వారందరుకూడ యీ

జనము ననుసరించుచు బయలుదేరిరి. మన వెఱ్ఱివాడీ జన మందతితో తిరిగి తిరిగి క్రంటోనుమెంటు చేరెను. మాయావతి మేడ తలుపులు విరచి లోనిచొరబడెను. ఈ జనులందరు ప్రవేశించిరి. పోలీసువారు వచ్చి చేరిరి. చదువరులారా! అప్పటి కక్కడ నేమిజరుగుచుండెనో మీరు గ్రహించియే యుందురు. పాపము! మనపత్తేదారిణి మాయావతి, బెదిరింపులకు లొంగనందున యెఱ్ఱగా కాల్చియున్న యూచలతో నామె కనులలో పొడువబోవుచుండిరి. మన వెఱ్ఱివాడమాంత మాకాలియున్న యూచలు లాగికొనెను. మాయావతి మొదలగువారందరిని పోలీసువారు పట్టి బంధించిరి. కమలను కట్లనుండి విప్పిరి. కమల పత్తేదారిణియని తెలిసికొని పోలీసువారందరు చాల గౌరవించిరి. మన వెఱ్ఱివాడా యూచలు పట్టుకొని గెంతుచూ "ఏమోయి అన్నయ్యలు! ఇది నామేడ ఈమాయావతి నాముండ ముండకి, ముఱుగులేయించాను. ముఱుగులలోను యినపముఱుగులు. ఎన్నాళ్ళున్నా నిరుసుతరుగు ఉండవు. నరేగాని పోయి హాయిగా పూరంతా తిరగకుండా యీ వెఱ్ఱివాళ్ళదరితో నాకేమిపని" అని యా వెఱ్ఱివాడు పారిపోవుచుండెను. మాయావతియే మాణిక్యము. ఠాణాకు తీసుకొనిపోయి ఖయిదుచేసిరి. కమల మాణిక్యము మహలంతయు పరిశీలించినది. ఎక్కడనూ ప్రభాకరునిజాడ కనబడలేదు. కమల పోలీసు అధికారులతో కలసి ఠాణాకువచ్చి మాణిక్యమును పిలిచి యిటుల సంభాషించెను.

క—నీ నిజమయిన పేరేమి

మా—మాణిక్యము.

క—నీది కాపురము రాజమహేంద్రవరము కాదా?

మా—అవును.

క—ఇక్కడి కేలవచ్చితివి?

మా—అక్కడ గాబడిలేక

క—నన్నేమేల బాధింపజూచితివి?

మా—నన్ను జయించితివను కోపమువలన.

క—నీ వెవరిని రానీయుటలేదుకదా? నీ జీవనాధార మెటులు?

మా—నా ప్రియుడు పంపుచుండును.

క—అతడెవరు?

మా—ప్రభాకరుడు.

క—ఆ! అతడు పారిపోయెనుకదా? యిపుడెచట గలడు?

మా—ఏమో రాత్రులయందువచ్చి నన్ను కలిసి ధన మిచ్చి వెళ్ళుచుండును.

క—నీవతనికి వ్యతిరేకముగ సాక్ష్యమిచ్చితివికదా? నీ కతడేల సాహాయ్యము చేయును?

మా—నాపై గల మోహమువలన.

క—కూనీసమాచారము లేమైన నీకు తెలియునా?

మా—తెలిసి యున్నంతవఱకు నీకు చెప్పియుంటిని.

క—ప్రభాకరుడు కూనీకోరని తెలిసియు వానితో నీవేల స్నేహము చేయుచుంటివి?

మా—ధనము కొరకు.

క—నీకుకూడ ఆ హత్యలో చాల సంబంధముండునని నాకు తోచుచున్నది. నిజము చెప్పెదవా లేదా?

మా—నిజమునే చెప్పుచుంటిని.

"భటులారా! యీమెను విడచిన లాభము లేదు. తీసుకొనిపోయి బంధింపుడు" అని కమల మాణిక్యమును కారాగృహమున బంధింపజేసి తనలో తా నిటులనుకొనుచుం డెను. ప్రభాకరుడు మాణిక్యము నుంచుకొనుట నిజమా? కాదా? నిజమే అయిన దానికిచ్చుటకు ధనమెటులు వచ్చును? ఏమో యెక్కడనైన దొంగిలించి యుండకూడదా? పాప మత డట్టివాడు కాడే! ఏమో యెవరుచెప్పగలరు? ప్రభాకరా! నీదాగుడుమూతలు చూడ నాకనుమానము కలుగుచున్నది. నీ కెవతెయో ఆటకత్తె లేనియెడల నన్ను విడచియింతకాలముండ గలవా? నీకై నేనిన్ని అవస్థలు పడుచుంటినిగదా? నీవేమైన నాకై శ్రమపడుచుంటివా? నీసంగతి కడువిచిత్రముగ నున్నది. ఏమైనను నీసంగతి పూర్తిగా తెలిసికొనక యీకమల విడుచు నదికాదని గ్రహింపుము. ఓయి ప్రభాకరా! నీవు నిజముగ మాణిక్యము నుంచుకొనుటయే నిజమైనయెడల నీవు తార

తమ్మ్యజ్ఞాన మెరుంగజాలని మూర్ఖుడవుసుమా ? ఏమంటివా ? శుద్ధక్షత్రియకన్యను నేను. జాతి నీతి లేని భోగముత్తొత్తు అది. బి. యె. చదివిన విద్యావంతురాలను నేను, విద్యాశూన్యురాలామె. నవకోమలశరీరను నేను, తొంబదిమంది ఆధీనమున నుండిన ఆడదది. గౌరవవంతురాలను నేను, గౌరవహీనురాలది. నిర్మలహృదయను నేను, కపటమానిసి యది. నిజమగు ప్రేమ నాది, కపటప్రేమ దానిది. నిజమగు మాణిక్యమును నేను, అది వట్టిగాజుపూస. పతివ్రతను నేను, పరపురుషాసక్తయది. గాన యిట్టి వ్యత్యాసము లెరుంగ జాలనియెడల నీవు జ్ఞానహీనుడవనుట సందియములేదు సుమా ?

---

## పదునేడవ ప్రకరణము

---

### "అనంతసేనము"

జూరత్‌లాల్ తన కర్మాగారమున కూర్చొనియుండెను. ఈసమయమున నెవరో యొక వ్యక్తి వచ్చి అయ్యా ! అని నమస్కరించి చేతి కొక యుత్తర మందజేసెను. ఈజాబు వలన జూరత్‌లాల్ యేమి తెలిసికొనియెనోగాని ఆమనిషిని లోనకు తీసుకొనిపెళ్లి వానితో యేమేమిరో ప్రసంగించెను. తనకు పని యున్నదని తండ్రితో చెప్పి ఆవ్యక్తితో పయనమై పోయెను. కొంతసేపటికి కర్మాగారమున పనివారాం డ్రందఱు

సాయంత్ర మగుటచే యెవరింట్లోను వారు పోయిరి. జూరత్ లాల్ తండ్రిగూడ తనపంపెద్దుబండియెక్కి ఇంటికి బోవబయలు దేరెను. నాడమావాస్యయగుటచే చీకటిమిక్కుటముగాలోకము నావహించెను. కర్మాగారపు చౌకీదారుమాత్రము గుమ్మముకడ కూర్చొని కునుకుచుండెను. మిణుకు మిణుకుమని యొక చిన్న దీపము మాత్రము వెలుగుచున్నది. ఇంతలో కర్మాగారము యొక్క పెరటితలుపు తెరచుకొని యెవరో యిద్దఱు లోన ప్రవేశించిరి. వారిచేతిగల బేటరీదీపము సహాయమున నలు దిక్కులును పరికించి ఇనుపపెట్టెకడకేగి తాళము తీసి అందు గల ధనము తీయుచుండెను. జూరత్ లాల్ తండ్రి దారిలో తాళముల వెదకికొని లేనందున నెత్తి నోరు మొత్తుకొనుచు వీథిగుమ్మము తిరిగివచ్చిన ఆలస్యమగునని పెరటిదారినే కర్మాగారమున బ్రవేశించి "ఒరీ! దుర్మార్గుడా! యెవడురా నీవు" అని ఆచోరుని బట్టుకొనబోయెను. ఆచోరుడును ఆచోరుని అనుచరుడును రామనాథునిపై బడి పీకనులిమి పెరటి దారిని పారిపోయిరి. కాని యెవరో యొకవ్యక్తి అచట గలడు. ఇంతలో చౌకీదారు పెద్దగోల చేయుచు లోనచేరి యానూతన వ్యక్తిని పట్టుకొనెను. ఇంతలో యిరుగు పొరుగు వారందఱు వచ్చి వానిని పట్టుకొనిరి. పాపమతడు "నేహంతకుడను గాను. వారు పారిపోయిరి. నే వారిని పట్టుకొని వీరిని రక్షింప వచ్చితిని" అని చెప్పుచుండెను. కాని ఎవరును నమ్మ

టలేదు. "నీవు వొంగవే. లేకయున్న ముఖముపై ముసుగు యేల వేసితివి" అని అందఱు అనుచు ఆ ముసుగుతీసిరి.

చదువరులారా! ఆ వ్యక్తి యెవరో తెలియునా? పాపము! మన ప్రభాకరుడు, ప్రజలు వానిని జూచి "ఓరీ! దుర్మార్గుడా! యిదివఱకుచేసిన కూనీ చాలక మరల యిటుల జేసితివా? నీనుండి యిదివఱకె ఒక కుటుంబము నాశనమైనది. అప్పుడే చావవలసినవాడివి జయిలునుండి పారిపోయి యింత కాలము బ్రతికితివి. ఇప్పటికి నీపాపము బద్దలయినది. ఇక తప్పించుకొనుట నీ తరముగాదు. అదుగో రక్షకభటులు బాబులారా! యీసారి అయిననూ యీచోరుని తుదముట్టించుడు" అని ప్రజలందఱు అనుచుండిరి. జూరత్‌లాల్ బోరుమని యేడ్చుచు వచ్చి తండ్రిపైన బడెను. పోలీసువారు ప్రభాకరునకు గొలుసులువేసి కట్టి ఠాణాకు తీసుకొనిపోయి రామన్‌లాల్‌గారి శవదహానమున కనుజ్ఞ నిచ్చిరి. సర్వస్వతంత్రుడైన జూరత్‌లాల్ పై కేడ్చుచున్నను మనమున నతి సంతోషించుచుండెను. మహావైభవముతో తండ్రిశవము నూరేగించుచు నక్కడక్కడ డబ్బులు, రూపాయిలు, పావలాలు, బేడలు, జల్లుచు దహానమునకు తీసుకొని వెళ్ళుచుండెను. మహాలుబ్ధుడగు రామన్‌లాల్ చచ్చినను యీ డబ్బుఖర్చు యిష్టములేక గావలయును. అనంతసేనమునుండి డబ్బు దండుగ వద్దువద్దు. అనుచున్నాడేమో అను నటులు తల నిటునటు ఊచుచు ఊరేగుచుండెను.

విజయనగరమునుండి మాణిక్యమును గూడ తీసుకొని వచ్చి జయిలునందుంచిరి. పత్రికాధారిణియగు కమల ప్రభాకరుడు జయిలునం దుంచబడిన వార్తవిని అత్యాశ్చర్యమునొంది ప్రభాకరుని విషయమై నిజానిజములు తెలిసికొనదలంచు చుండెను.

ఒకనాడు రాత్రి జయిలునం దుంచబడిన ప్రభాకరుడు చాల రాత్రియైనను నిదురరాకనో దుఃఖమాపుకొనజాలకనో తనలో తా నిటులనుకొనుచుండెను.

దైవమా! నన్ను యీవిధి భరింపరాని నిందలపాలై సర్వజన నిష్ఠురుండనై నిరపరాధశిక్షలకు లోనై ప్రియకాంతా వియోగవిచార పరిపూరితమనస్కుండనై యుండునటు లొనర్చితివా? కమలా? మనోహారీ! నిన్ను మరతునన్నను మరపు రాకున్నది. నేనెటులు మరువగలను. ఆమె మాటలు నేర్చిన పసిడిబొమ్మ భూలోకమునకు దిగిన చంద్రకళ నిలచి గనుపట్టు మెరుపుతీగ సువాననగల కెంపు. ఆహా! యెంతకని వర్ణించను! ఎంతని పరితపించను! ఎంతని విచారించను. పాప మామె నాకై యెంత శ్రమపడుచున్నది. గాని యేమిచేయుదును. నాడు పారిపోయి అనేక మారువేషములం ధరించి నా ప్రియు రాలికి సహాయ మొనను చేయుచుండెడివాడినిగాని యిప్పు డా అవకాశమైనను లేదే. ఇంతకుమున్నె ఆమె నాకై యుంచు కనుమానించి యుండును. నా ప్రియురాలినిపు డెటులునమ్మింప గలను, ఆమె ముఖ మెటులజూడగలను. చూడక యెటులుండ గలను,

కమలా ! నీయెడ నాకెట్టి అనురాగముగలదో యెంత మోహముగలదో నీకెటుల తెలియును ! నాడు నీవు కొండలో యలోపడియుండ మునివేషముననున్న నేను నాశిష్యులను తోడిచ్చి ఉపచర్యనొనర్చి నిరపాయముగ పంపినది నేనని నీ వెటులు తెలిసికొనగలవు ముఖమునకు ముసుగు వేసికొని నన్నెన్ని సారులు రక్షించలేదు ? తుదకు చాటుగనేయుండి నీకు సహాయపడుచు నీతల్లిని నిజముగ జంపినహంతకుడు దొరికిన పిదపనే నిను కలిసికొని నీ కాశ్చర్యము ఆనందము గలుగజేయ దలంచి యుంటిని. ఇంతలో యిటుల పుట్టిమునిగినది. ఏమిచేయుదును. తానొకటితలచిన దైవమొకటిదలచుననునది నిశ్చయమైనది. అని ఇంకేమేమొ అనుకొనుచుండెను అప్పటి కెంత సేపటినుండి వచ్చియుండెనో గాని మన కథానాయికయగు కమల తన మనోనాథుడగు ప్రభాకరుని సమీపించి "ఆర్యా సమస్కారము. తమకై యెంత శ్రమనొందుచున్నను ప్రయోజన మగు పడకయున్నది. నాటిహత్యాపరాధము మీపై బడుటంజేసి అందుగల నిజానిజములారయ నేనటులసాహసించి పనిచేయుచుండ మరల యీ విరుద్ధము సంభవించినది. సుఖాసుఖములు దైవాధీనములు గాని మానవప్రయత్నమునకలవిగావు. నాటి మొదలు మీరేమైనో తెలియక మీముఖారవిందసందర్శనమునకై నను నోచుకొనలేనందులకు విచారించుచు మీకు నాయెడ ననురాగము లేదని తలంచుచు తల్లిపోనపోయినది. తండ్రి జాడనైన నెరుంగక యేకాకినై కృశించుచు కార్యదీక్షను

మాత్రము విడువక కృషిసల్పుచుంటిని. ఈమీమాటల వలన తమకు నాయెడ గలదయ, వాత్సల్యము. నాకొనర్చిన మహోప కారములు తెలిసికొని అమందానందము నొందితిని. నాకష్టము నకు ఫలితము దొరికినటులు సంతసించితిని. మన మీనిందు యవ్వనమున నొకరి నొకరు యెడబాసి మనస్థిమితకైన లేక బాధపడుట కేమిపాప మొనర్చియుంటిమోకదా ! ఏమైనను నాథా ! యెప్పటికైనను నిరపరాధు లనిపించుకొని కీర్తివంతు లమై ఆఖరుదశయందైనను సుఖించకపోవుదుమా ? కాకియై కలకాలము బ్రతుకుటకన్న హంసయై ఆరునెలలు బ్రతికిన చాలదా ? నాథా ! మిమ్ము నే కొన్ని సంశయము లడుగదలంచి తిని. దయయుంచి వాటికి సత్యమగు సమాధానములీయ ప్రార్థితులు."

ప్ర—కమలా ! నీ మాట కభ్యంతరముండునా ? నేను సత్యవంతుడనో కానో తెలియదా ?

క—ఆర్యా ! రామన్‌లాల్‌గారి యింట హత్య నసు యమునకు మీ రెట్లు లక్కడ దొరికిరి ?

ప్ర—కమలా ! నే నిశిసమయమున ముఖమునకు ము సుగువేసికొని సంచరించుచు ని న్ననుసరించి అవసరమైన సహా యమొనర్చుచుండెడువాడను. నాడు నీవిగ్రామమునకు వత్తువని తలంచి వెళ్ళుచు రామన్‌లాల్‌గారి కర్మాగారమున గప్పుగప్పుమని దీపము వెలుగుటయు, ఆరిపోవుటయు, లోననుండి యెవరో మరణ

వేదనలోనుండి మూలిగినటు లొకమూలుగు వినంబడుటయు తటస్థించినది. ఆ వెంటనే నేను తెరువబడియున్న కవాటము నుండి లోన కుఱికితిని. నన్ను జూచి యెవరో యిద్దరు పారిపోవు చుండిరి. నేను వారిని పట్టుకొన ప్రయత్నించితినిగాని వారు తప్పించుకొని పోయిరి. అయినను నాచేతగల చాకుతో వారి వెన్నున నొకటిరెండు పోటులు పొడిచితిని. ఇంతలో చౌకీదారు వచ్చి నన్ను పట్టుకొని గోలచేసెను.

క—విజయనగరమున మాయామహాల్ మీ కెఱుగు దురా?

ప్ర—ఎరుంగను.

కి—మాణిక్యము నుంచుకొనుట నిజమేనా?

ప్ర—రామ, రామ! నే నెట్టివాడనో నీ వెరుంగవా?

క—సరియే. నాథా! నే నుదయమున వచ్చి నా జామీనుపైన మిమ్ము విడిపించెదను. మన మిరువురము కలసి యీ హత్యాపరాధు లెవరో ప్రయత్నింపవలయును. దయ యుంచి యిప్పటికి శెలవిండు. అని కమల ఆ స్థలము విడిచి పోయెను. అక్కడనుండి కమల తన గృహమునకువచ్చి తనలో తా నిట్లనుకొనుచుండెను.

మాణిక్యము మాటలువిన్నను, కూనీసమాచారములు విన్నను ప్రభాకరుడు అపరాధియని తోచకమానదు. గాని చిన్ననాటినుండియు అతని హృదయ మెరింగిన నేను అతడిట్టి

అపరాధము జేయునని యెటులు జెప్పగలను. అయినను మానవులబుద్ధి మారవచ్చుననుటకు సందియము లేదు. పోలీసు వారు చేయుచున్న బుజువులనుబట్టి యితడే అపరాధియని తోచుచున్నది. అటులే అయిన నే నడిగినప్పుడు కూడ తాను నిరపరాధనియు, మాణిక్యమును నెరుంగనే యెరుంగననియు జెప్పనే. ఆ! నాయెదుట అటుల జెప్పక మఱియెటుల జెప్పును? నాయెదుటనే అననేల తానొంటరిగా జైలునందుండి అనుకొనిన మాటలు నే వినలేదా? పడినసంతాప మెఱుంగలేదా? తానొందుచున్న నిరపరాధశిక్షకు విచారించలేదా? ఎవరును లేకపోయినను తానటులేల అనుకొనవలయును. ఇతడెంతమాత్రమును అపరాధి కాడు. మాణిక్యమును మోహింపలేదు. నన్నే మనసార ప్రేమించియుండెను. ఎవరో అతనిపై కిట్టక యీ అపరాధము లా నిరపరాధిపై మోపి బాధింపజూచుచున్నారు. అయిన నతడా సమయమున కా స్థలమున నేలపోవలయును? వానికి తగినటు లాతనికి వ్యతిరేకముగ నిదర్శనసాక్ష్యము లేల లభింపవలయును! ఈ సంశయ మెటులుతీరును? దొంగయని యెవరినెత్తిపైనను వ్రాసియుండదు? అందులకేకదా దొంగయును మనిషివంటివాడే యందురు. ఇతరసాక్ష్యములేల నామనస్సాక్ష్యము నాకు చాలదా? ప్రభాకరమహాశయుడు నిరపరాధి. శిక్షకర్హుడు కాడు. అయిననూ పూర్వజన్మకృతమువలన గావలయును. యీపాటు పడుచుండెను. ఏమైననూ నేనతనికి సహా

యనపడక తప్పదు. రేపటి యుదయముననే నా జామీనుపైన విడుదలచేయించెదను. మేమిరువురము కలసి నిజమగు హంత కులను బట్ట ప్రయత్నించెదము.

---

## పదునేడవ ప్రకరణము

---

"ఆహా యెంతటిమాయకాడు. ఎంతదుర్మార్గుడు. ఎంత టికుటిలుడు. ఎంతటి ద్రోహి; మాటలలో తేనె లొలికించును. మనసులో విషము నింపించుకొనును. అయ్యో! తేనె పూసిన కత్తియని యెఱుంగజాలక పోయితిని. మేకవన్నె పులియని తెలిసికొన జాలకపోయితిని గోముఖవ్యాఘ్రమని యెఱుంగ జాలక పోయితిని చిన్ననాటి స్నేహితుడని నమ్మితిని. నిజమగు ప్రియుడని ప్రేమించితిని. ఎంతమంది బోధించినను ఆసీచుని మాట లెక్కచేసితిని. నాడు జైలునందు గూడ నన్ను చూచియే ఆకుటిలుడు యేమియు నెఱుంగని నంగనాచి వలె మాటాడుకొనెను. నన్ను చూడలేదనుకొని వానిమాటలు విని విశ్వసించి నాజామీనుపై నాక్రూరుని విడుదల చేయించి తిని. ఆ విశ్వాసమైన నుంచక ఈమోసకాడు, ఈదొంగ, ఈహంతకుడు, ఈవిపురుగిప్పిన నిప్పు ఎంతపని చేసెను! అకటా! యిది నా స్వయంకృతాపరాధమే గాని వాని తప్పులేదు.

దొంగను నమ్ముట దొరకు తగనిపని. ప్రభాకరా! నీవింతటి ఘోరమోసము చేయుదువని కలనైన తలంపలేదు సుమీ! నాతో వచ్చినట్లే వచ్చి నన్ను యీమాయామహాలునమాగా చేసి మాయమై పోయితివా? దుర్మార్గుడా! యిక నిను విడువను. నీమోసము లిక సహింపజాలను. మా పోలీసు సోదరు లందరు నీవు హంతకుఁడవని యెన్ని నిదర్శనములు చూపినను నీవొనర్చు ప్రత్యుపకార మిదియా? వరయే, మించినది లేదు. నీవీభూప్రపంచమం దెచ్చట నున్నను యీనారీకేసరి విడుచు నదికాదని తెలుసుకొను" మని మన కమల విజయనగరమున గల "మాయామహాలు"న ప్రభాకరుని గోలుపోయి యెంత వెదకిన నతడు కానరానందున మాయామహాల్ నంతయు మూసి బీగములు బిగించి "తిన్నగా పోలీసు ఠాణాలయామునకు బయలు దేరి అచ్చట పోలీసు అధికారులను గలిసికొని వారితో యీ వృత్తాంతమునే యిటుల ప్రసంగించుచుండెను.

క—ఏమండోయి? యినస్పెక్టరు గారు! ప్రభాకరు డెటులుచేసెనో చూచితిరా?

ఇ—నిన్న నేకదా మీరిద్దఱు యిచ్చటికి కలిసి వచ్చితిరి? ఇంతలో నేమి జరిగెను?

క—అవును. నేడు సంధ్యానమయమున సుమారై దారుగంటలకు నేను, నాతడును ఇష్టాగోష్టి మాటాడుకొను

చు పెద్దచెరువు ప్రక్కనుండి షికారుగ బయలుదేరి స్టేషనుకు చేర అచటించుక ఫలహారము లారగించి కంటోనుమెంటున గల "మాయామహాల్" ను జూడవెళ్ళితిమి...

ఇ—సరియే, ఏమిజరిగినది ?

క—మే మిరువుర మాలోన ప్రవేశించి అందుగల చిత్రముల దిలకింపుచుండ నన్నెవరో "కమలమ్మగారు" అని బయటనుండి పిలచిరి. ఎవరా అని నే బయటకువెళ్ళి ఎవరిని గానక తిరిగి వచ్చితిని ఇంతలో ప్రభాకరు డేమాయెనో కన బడలేదు.

ఇ—ఏమేమిటీవింత ! మాయామహాల్ నంతయు వెతికితిరా ?

క—ఆ ! అంతయు గాలించితిని.

ఇ—ఎక్కడనూ కనపడలేదా ?

క—కనపడలేదు.

ఇ—ఆ మహాల్ నకు మీరు వెళ్ళినదారిని తప్ప మరియే దారి అయినను తెరువబడియున్నదా ?

క—పెరటితలుపు మాత్రము తెరువబడియున్నది.

ఇ—ఆ దారిని వెళ్లి చూడలేదా ?

క—చూచితినిగాని యెటుపోయినది తెలియలేదు.

ఇ—అచ్చట నెవరినైన నడుగలేకపోయితిరా ?

క—అడిగితినిగాని మాకు తెలియదని కొందఱును,

యీ యింటినుండి యెవరును బయటికిరాలేదని కొందఱును చెప్పిరి.

అని ఈ విధముగ మాటాడుచుండ నొక రక్షకభటుడు వచ్చి కమలకు సలామొనర్చి "నేను రాజమంత్రినుండి వచ్చి తిని. మాఇనస్పెక్టరుగారీకవరు తమకందజేయుమని పంపిరి." అని ఒకకవరు చేతికిచ్చెను. కమల అత్యాశ్చర్యమునొంది ఇంత తొందరగా పంపిన యీజాబేమైయుండునాయని తక్షణమా కవరు చించిచూచెను. ఇటులు వ్రాయబడియున్నది.

"పత్తేదారిశేగారికి.

ఇచ్చట జైలునందుంచబడిన మాణిక్యమునకు నిన్న 88 వ నెంబరు రక్షకభటుడు, ఒకవుత్తర మందిచ్చుచుండ నేనది పట్టుకొంటిని. అది ఆమెకు ప్రభాకరుడు వ్రాసినది. అతడే హంతకుడని మీ కెన్నిపర్యాయముల మేము చెప్పినను మీకు తలకెక్కినదిగాదు. మొదటినుండియు మీ కతడు మోసము లే చేయుచున్నను గ్రహింపజాలక పోయితిరి. తుదకు యిప్పుడు కూడ మిము మోసగించిపోయెను. ఇప్పుడైన వాని సంగతి మీకు బోధపడినదా? ఇంకనూ నామాట నమ్మరేమో యని యూహించి అతడు మాణిక్యమునకు వ్రాసిన యీ వుత్తరము కూడ యిందులో మీకుపంపితిని. తమరు తక్షణము బయలు దేరివచ్చి కర్తవ్య మూహింప ప్రార్థితులు.

ఇట్లు,
ముఖర్జీ"

"ఇనస్పెక్టరుగారూ ! చూచితిరా ! ఈరోజులలో మొప్పరిని నమ్మరాదుసుమండి" అని ముఖర్జీగారు వ్రాసిన యుత్తరమగుపరచెను.

ఇ—ఏదీ ప్రభాకరుడు వ్రాసిన వుత్తరము చదవండి ?

క—చిత్తము వినండి.

"ప్రియకాంతయగు మాణిక్యమునకు.

కారణాంతరములచే నిన్నెడబాసి యుండవలసివచ్చినందులకు చాల విచారించుచున్నాను. నీకొఱకై ధనముగూర్ప రామనాధముగారియింట జొరబడియుండ పట్టుబడి జైలునందుంచబడుటయు, నాకల్లబొల్లి యేడ్పులు విని కమల విడుదల చేయించిన సంగతియు నీ వెరింగియే యుందువని తలంచెదను. పిదపా మెతో విజయనగరమువెళ్ళి మాయామహల్ నకు తీసుకొనివెళ్లి అక్కడామెను మోసగించి, వచ్చివేసితిని. నిన్నుగూడ త్వరలో విడిపించెదను. తొందరనొందకుము. నీవు లేకపోవుటచే నా కుడిభుజము లేనట్లైనది. నిన్నందఱు ముద్దిల మాణిక్య మందురుగాని ముద్దుల మాణిక్యమనిన బాగుండునని తోచుచున్నది.

ఇట్లు,
ప్రభాకరుడు."

ఇ—ఈవుత్తరములు కడుచిత్రముగా నున్నవి. ప్రభాకరుడే దొంగయనుటకు ప్రబలసదర్శనము లగుపడుచున్నను

మీరాకతనిపై గల అనుమానముచే వానిని దోషికానునుచుంటిరి. తుదకు మీరామెడలకూడ అపకారము సల్పుచున్నను మీకు బోధపడుచుండుటలేదు. ఇప్పుడానేరస్థుని పోలీసువారికి తిరిగి యప్పగించుటకుగాని అతడు నిర్దోషియని ఋజువుచేయుటగాని జేయవలసినపని మీదై యున్నది. లేనియెడల మీరుకూడ ప్రభుత్వమువారి నిందకు పాత్రులగుదురు.

క—అగునగును. మీరుచెప్పినది సత్యమే. న్యాయము కొఱకు ప్రయత్నించుచుంటిగాని ప్రభాకరుని విడిపించుటకే కాదు. నిజముగ నతడే హంతకుడైన ప్రభాకరుడై నపట్టి యురికంబము నెక్కించి తీరుదును. కాని పేరుగాదు. ముఖర్జీ గారు పంపిన యీపుత్తరములు కడువిచిత్రముగనున్నవి. గాన సెలవిండు. నేరాజమహేంద్రవరము వెళ్ళినిజానిజములారయ ప్రయత్నించెదను. అని కమల సెలవుతీసుకొని బయలు దేరి తత్క్షణము మెయిలు బండికందుకొని రాజమహేంద్రవర మునకు బయలుదేరెను.

రాజమండ్రిలో "దానవాయిగుంట" వద్దగల మన పత్తేదారుని బంగాళా మాచదువరు లెఱుంగనిదికాదు. కమల తన బంగాళాలోగల వీధివరండాపై నొక పడకకుర్చీయందు సుఖాసీనయై కూర్చుండి ముఖర్జీగారు పంపిన యుత్తరములుతీసి చూచుచు నేవోకొన్ని పుస్తకములు దీసి యందుగల ప్రభాక రుని దస్తూరితోను, ప్రభాకరుని నంతకముతోను, యీజాబు

ను సరిపోల్చుచు, తారతమ్యములారయుచు "ఈప్రభాకరుని చరిత్రనాకేమియు గోచరమగుటలేదు. అతడు చేయుపనులును నబడుచున్న నిదర్శనములును అతడే హంతకుడని, నిరూపించుచున్నవిగాని, అతడెంతమాత్రము ద్రోహికాడనియు, ర్దోషియనియు నామనస్సాక్షి నొక్కి వక్కాణించు చున్నది యిన నీవుత్తరము లెటులువ్రాసెను. అతడు వ్రాసినవికావేమోయని శోధించుచున్నది. ఏలనన ఆతని సంతకమునకుగాని, వస్తూరికిగాని, యీయుత్తరములనుగాని, యెంత పరిశీలించి ను యెక్కడను సరిపోవుటలేదు. ఏమో దొంగయుత్తరములు వ్రాయువాడు దొంగవ్రాతలు వ్రాయగూడదా? దొంగ వ్రాసిన దొంగసంతకమే చేయునుగాని తన నిజమగు పేరు వ్రాయునా? ఈజాబులాతని వైరులెవరో వ్రాసియుండవచ్చునని నానమ్మకము. అటులేఅయిన నితడు నన్నువీడి మాయామహల్ నుండి పారిపోవుటకేమికారణము. ఏమో పారిపోయెనో ఆతని విరోధులెత్తుకొని పోయిరో యెవరుచెప్పగలరు? ఇతనికి విరోధులెవ్వరైయుండవచ్చును. హంతకులు" అనితనలో తానను కొనుచుండెను. ఈసమయమున ముఖర్జీ గారును మరినలువురు పోలీసు భటులును, మాణిక్యమును, మాణిక్యమున కుత్తరమందిచ్చిన వానిని తీసికొనివచ్చిరి.

మః—అయ్యా! వీడెమాణిక్యమునకుత్తరముతెచ్చెను.

క—వీడు మన పోలీసు భటుడేనా?

ము—కాదు గాని మనపాగా యెటులునో సంపాదించెను.

క—ఆనెంబరుగల కానిస్టేబువద్ద పాగాయున్నదా ?

ము—ఉన్నది.

క—నాడు చౌకీ ఎవరిది ?

ము—వానికి హఠాత్తుగా జ్వరమువచ్చినది.

క—మీాకపి బుజువేటులు ?

ము—వాడు ఆసుపత్రిలో నుండెను.

క—ఓరీ నీవెవరు ?

వ్య—ప్రభాకరుడిగారి వద్దనుండి జాబుతెచ్చినవాడిని.

క—అతడెచ్చటనుండెను ?

వ్య—ఆమాటచెప్పను.

క—ఎందుచేత ?

వ్య—స్వామిద్రోహినగుదును.

క—అయిన శిక్ష ననుభవింతువా ?

వ్య—అనుభవింపకున్న తప్పునా ?

క—నిన్ను తప్పించిన వాని ఉనికిచెప్పి వానినొప్పగించెదవా ?

వ్య—అటులే చేసెదనుగాని పిదపమీారు తప్పింపలేరేమో ?

క—నామాటనమ్ముము. తప్పకతప్పించెదను ?

వ్య—అటులయిన తా మెంటరిగ రావలయును. ఏలనన మీరు నాకు ఓడిపోయిరని మావారు తలంచెదరు. మీరు లోనకువచ్చుటకు ఆటంకముండదు. అక్కడగల సర్వరహస్యములను దెలిపెదను.

క—సరియే ముఖర్జీగారూ! తస్కరీ మాణిక్యమును తిరుగ జైలులో నుంచుడు. అని పలికి ఆచోరునితో గలిసి మోటారుపై బయలుదేరెను. నాలావీధి చాలదూరము పోయిన పిదప మోటారుదిగి పంపివేసి కమలను బంధించి ఊరిబయట గల యొక గృహమునను తీసుకొని వెళ్లెను. వెంటనే వీధిద్వారము మూయబడినది. కమలను తీసుకొనివచ్చిన యాచోరు డేమాయెనో కనబడలేదు. కమల కాభవన మతి భయంకరముగ గానబడుచుండెను. త్రుటికాలములో మఱియొకతలుపు తెరువ బడినటులు చప్పుడైనది. కమలందుండి వచ్చినవ్యక్తినిజూచి "ఓరి వీరన్నవా? ఆగు. లేనియెడల జచ్చెదవు" అని పిస్తోలు గురిచూపెను. వీరన్న యామాటకు జవాబీయక జేబునుం డేదియో పిడికెడు గుండదీసి గుబాలున కమలకండ్లలో కొట్టి ప్రక్కకు తప్పుకొనెను. కమల "ఢాం" మని పిస్తోలు పేల్చెను గాని కనులనిండ కారముగుండ పడుటచే కమల మంటచే కనులు తెరువలేక బాధపడుచుండెను.

# పందొమ్మిదవ ప్రకరణము

---

## "కమలకోక జాబు"

మాచదువరులా కమలజయమునుచూడ కళవళ పడుచుం డరని నేనెరుంగుదును కాని సమయము తప్పివచ్చినప్పుడు ఎంతటివారైనను విధికృతమున కలిగిన కష్టము లనుభవింపక తప్పదు. అవతారపురుషుడగు శ్రీరామునకు సహితము వనవాస మనుభవింపవలసివచ్చెను. కేవల ధర్మమూర్తియగు ధర్మజుడు సహితము కొలువున చేరవలసివచ్చెను. సత్యావతారులగు రాజాధిరాజులైనను సతీమణుల సహితముగ యిడుముల పడ వలసివచ్చెనని మాచదువరు లెరుంగనదికాదు. అటులనే సర్వ సుగుణముల గనియు ధైర్యశాలియు పతివ్రతానిష్ఠా గరిష్ఠయు రూపలావణ్య శిరోమణియు, న్యాయావలంబ శిరోమానినియు నగు మన కథానాయికి కమల కనులమంటచే మితిలేని బాధ నొందుచుండ వీరన్న ఆమెపై బడి చంప నుంకించుచుండ వెనుకనుండెవరో నొకవ్యక్తివచ్చి కమలను వీరన్నను తన బహుబలముచే చెరియొక చేతపట్టుకొని వీధియందున్న మోటారుపై గట్టి శరవేగమున తీసుకొనిపోయి పోలీసుఠాణాకు చేర్చి యదృశ్యుడాయెను. పిదప పోలీసువారందరు కమలనుచూచి పత్తేదారినియని గ్రహించి, అనేకచికిత్సలుచేసి కనులమంటలు పోవునటులజేసి వీరన్న వృత్తాంతమెరింగి వానినొక గదియందు

బంధించి యుంచిరి. పిదప కమల మమ్మునిక్కడకు తెచ్చినవా రెవరని పోలీసువారి నడిగెను. వారు తెలియదనినందున వీరన్న వద్దకు వెళ్ళి "ఓరీ మమ్ములనిచటకు తీసుకొనివచ్చినవారెవరు?"

వీ—వానిని పోల్చుకొనుట కవకాశములేదు అతడా పాదమస్తకము ముసుగు వేసుకొని యుండెను. అతడే మమ్ముల నీబంధనమ్మునకు దెచ్చిపడవేసెను. పిదప నిశ్శబ్దముగా వెడలి పోయెను ఏమనను నాకపకృతి చేసియుండుటచే నాకు శత్రువను నీకు మిత్రుడను అనిమాత్రము జెప్పవచ్చును.

కమ—ఓరీ నిన్నింకను కొన్ని ప్రశ్నములు అడుగ దలంచితిని నిజము చెప్పెదవా?

వీ—చెప్పవలసినవి అయిన చెప్పెదను.

కమ—నీవే హంతకుడవని తోచుచున్నది. హంతకుడవా? వాని యనుచరుడవా?

వీ—నేను హంతకుడను గాను వాని యనుచరుడను గాను.

కమ—అయిన నాకు నన్ను నీ కర్మాగారమున నేల బంధించితివి?

వీ—నా వ్యాపారమున కడ్డువచ్చుచుండుటచేత.

కమ—ఇప్పుడైనను నాకు నేచూపినపెట్టె ఎవరికి అమ్మితివో చెప్పగలవా?

వీర—ఏమో నేజ్ఞాపకముంచుకొనలేదు.

కమ—నీసంశయ ప్రత్యుత్తరములవల్ల నీ చర్యలవల్ల నను నీవే హంతకుడవని దోచుచున్నది. నిజము చెప్పనియెడల కఠినశిక్షకు పాత్రుడవగుదువు.

వీర—హాసి విధికృత్యమును ఎవరు తప్పింపగలరు.

కమ—నిజము చెప్పవా?

వీర—నే నెరుంగను.

కమ—సరియే వీరినీవిధశైలునం దుంచుమని చెప్పికమల పయనమై దానవాయిగుంటయందుగల వనబసచేరి భుజించి వాకిట చల్లగాలికి కూర్చుండియుండెను.

నాడు పౌర్ణిమయగుటం జేసి నిండు వెన్నెల కాయుచుండెను. మనకథానాయికి యగు కమల ముఖబింబమున ఆచంద్రబింబము ప్రతిఫలించుచుండెను. ముఖాశీనయైయున్న కమల ఈహత్యాసమాచారముచూడ అంతకంతకతి అభేద్యముగా గనబడుచున్నది. ఇప్పటికి నాచే బంధింపబడిన పటాల వీరన్న, బండవీరన్న, అహిరావణుడు, మాణిక్యము మొదలగు వారందఱు హత్యకు సంబంధించిన వారనుటకు సందియములేదు. ప్రభాకరునియొక్క మాటలను బట్టిచూడ హంతకుడు కాడనియు నాకు మిత్రుడనియు తోచుచున్నది. గాని ననువీడి పారిపోవుట మొదలగు సంగతులారయ శత్రుడేయనియు భయము జనించుచున్నది. మరియు నను ప్రాణాపాయసమయముల రక్షించుచున్న ఆ ముసుగుమానిసి ఎవరో ఎఱుంగు టతికష్టసాధ్యముగానున్నది.

పోలీసువారు మరల ప్రభాకరుని బంధించియుంచి యతనే హంతకుడనియు వీరన్న మొదలగువారందఱు అతని యనుచరులనియు కేసుపెట్టిరి. ప్రభాకరుడు హంతకుడు కాడని నేనెంత వాదించినను, వారు వినుటలేదు. కొన్ని అంశము లనుబట్టి చూడ ప్రభాకరుడు హంతకుడు కాడని నాకుతోచుచున్నది. కేసు రేపే విచారణ చేయబడును గాన నేనుగూడ నాకుగల నిదర్శనము లన్నియు చెప్పి ప్రభాకరుడు హంతకుడు కాడని వాదించవలసియున్నది. అయిన నిజమగు హంతకుడెవరు? ఎవరో పిదప చూచుకొనవచ్చును. ఇప్పటికీ విచారణలో ప్రభాకరుని తప్పించక తప్పదు” అని ఆలోచించుకొనుచుండ యింతలో తపాలా నౌకరు వచ్చి ఒక జాబందించెను. కమల ఆ పత్రము నంచి చించిచూడ అందొక యుత్తరమిటుల వ్రాయబడియున్నది.

“ప్రియసుందరీ కమలా!

సత్యాసత్య నిర్ణయాసమర్థురాలనని నే నెఱుంగుదును. నా విరోధులు చెప్పిన మాటలను బట్టియు దైవికముగ గలుగుచున్న దృశ్యము లనుబట్టియు నేనేరస్థుడనని నీవూహించియుండవచ్చును. దీనికితోడు మనమానాడు మాసూమహాల్ చూచుచుండ నిన్నెవరో పిలువ నీవావలకు బోయి వచ్చునంతకు నేలేకుండుటచేత వెదకివేసారి నీకు ద్రోహముచేసిన ద్రోహిననియు, విశ్వాసహీనుననియు, అసత్యశీలుడననియు తలంచి నన్నెంత నిందించియుంటివో ఎఱుంగజాలను. కమలా! నాకు జరిగిన చిత్ర

మెఱుంగక నీవు నన్నుకొనినను, అనుకొనకున్నను నేను దేశద్రోహినిగాననియు, ప్రేమరహితుడనుగాననియు విశ్వాసహీనునిగాననియు నీకెఱుకజేసుకొనుటకే జాబు వ్రాసియుంటిని. నీ వావలకు పోవునపుడే ఆ ప్రక్కనగల ఒకమీటు తెలియక నొక్కితిని. ఇంతలో నేనకస్మాత్తుగ నొక సొరంగమునబడితిని. అందు కొన్ని దినములు బాధపడి ప్రాణావశిష్టుడనై యుండ రక్షకభటులు లామహాల్ పరిశీలింపవచ్చి అందు నన్నుగని నేనున్న సొరంగము తలుపు తెరచి బయటకుతీసి బంధించి జైలునందుంచిరిగాన నిన్ను తిరుగ చూచి మాటాడు భాగ్యము లభింపలేను. కాంతా నేనిన్ని నిందల పాలగుచున్నను, కష్టపరంపరలకు లోనగుచున్నను ప్రజావిరోధినైనను బ్రతుకజూచుచుండుటకు కారణమేమో తెలుసునా? చిన్ననాటినుండి పెంచి నన్ను పెద్దజేసినవారిని చంపిన దుష్టుడనను నపయశము బాపికొనుటకును బ్రతికియున్న నీతండ్రిగారికైనను వృద్ధావస్థయందు సేవజేసి నాఋణముదీర్చుకొన దలంచియు చిన్ననాటనుండి కలసిమెలసి చరించుటచే గలిగిన నీపై నాకుగల ప్రేమ వృథా గానీయక యెట్లైనను నీమెప్పు వడసి నిన్ను చేబట్టి ప్రజలందరచ్చెరువొంద నిన్ను పరిణయమాడి జన్మ సార్థకముచేసికొన దలంచియు, ఇటుల జీవించియుంటిని. రేపే నాపై నారోపింపబడిన నేరము విచారింపబడును. నేనే హంతకుడ ననియు, నాపైనే పోలీసువారు పోలీసుకోశాధ్యక్షులు సర్వవిధప్రమాణములను తయారుచేసి సిద్ధముగనున్న సంగతి నీవె

రింగి యేయుందువు. నాతరఫున సాక్ష్యమిచ్చుటకు గాని, వాదించుటకుగాని, నన్నీ యాపదనుండి తప్పించుటకుగాని ఎవరును గానరారుగాని, నాకా దిక్పాలకులే సాక్షులు. నా మనస్సాక్షియే గొప్పసాక్షి. నా గూఢచర్యలే నిక్కములగు సాక్ష్యములు. ఏమైనను వీటిలో ఒకటియును నమ్మువారు లేరు. పరిశీలించువారు లేరు. ఏమైనను నిజము నిలకడమీద తెలియక పోదనునాశ ఒక్కటియే నాకాధారముగ నున్నది. కమలా! నే నేరస్థుడను గాను నామనంబు నీవెరుంగవా? నే నిర్దోషినని నీమనస్సాక్షి బోధించుటలేదా? నన్ను దుఃఖసాగరమునుంచి తప్పించువారెవరునూ గానరాలేదు. నీవు కూడ నుపేక్షించిన నురికంబమెక్కుట తప్పదు. కాంతా! సాధ్వివగు నీమనోనాథుని రక్షింపకపోయిన పతివ్రతవుకావు. నీవు తలంచిన నిజము భేదించగలవను నమ్మకము నాకున్నది. ఇదియే నాఆఖరిలేఖ నీవు నన్నుద్ధరించ మనసు లేకపోయినను దుష్టులగు నాశత్రువులు నన్ను చంపులోపల నీముద్దుముఖారవింద సందర్శనమును గలుగచేయవలెను.

ఇట్లు,
'ప్రభాకరుడు'

కమల యీజాబు చదువుకొనువరకి కనుల నీరు గ్రమ్మెను. మనస్సు కళవళపడెను. దేహము ముచ్చెమటలుగ్రమ్మెను. వేడినిట్టూర్పు విడిచెను. పిదప తనలో తా నిట్లనుకొనెను.

"ప్రభాకరా! నీమనమునకు దేహామునకు పడరాని యిడుముల పడజేసిన దీపాపికదా? మొదటినుండియు నీవు నిర్దోషివని నామనస్సాక్షి నాకు బోధించుచున్నది. నన్నునేకాపదలనుండి మాయవేషమున రక్షించినది నీవే యనుటకు సంశయములేదు. కాని నీపై వచ్చిన మాయదారి సాక్ష్యములన్నియు నీవే నేరస్థుఁడవని రుజువు చేయుచున్నవి. అవి కేవలము కల్పితములని నేసంశయించి చాలవరకు ప్రయత్నించితిని గాని వేరుహంతకు డెవరును గానరాలేదు. ఏమైనను రాత్రి యంతయు యోచించి నాచేతనైనంతవరకు నే నీప్రభాకరుని తరఫు న్యాయస్థానమున వాదించి చూచెదను" అని యనుకొనుచు శోనకు బోయెను.

---

ఇరువదియావ ప్రకరణము.

---

"విచారణ"

రాజమహేంద్రవరము కడు జనసమృద్ధిగల పట్టణము. ఒకనాడాపట్టణమున ప్రజ లతి అల్లకల్లోలపడుచు బాలాది వృద్ధులు వారివారి కార్యములు సహితము విడిచి సుమారు పగలు పది గంటలకాలమున రాజబాటను బయలుదేరి గుంపులుగుంపులుగా వెళ్ళుచుండిరి. ధనవంతులు, సుకుమారులు గూడ శకటములను ద్విచక్ర శకటములను, చలనహేతు శక

టములను, ఎక్కి వెళ్లుచుండిరి. నాడు ఏకారణముననో ఆ గ్రామమునగల వర్తకులు అందఱుకూడ వారివారి వ్యాపారములను ముగించి యీ మార్గముననే వెళ్ళుచుండిరి. చదువరీ! వీరికీ ఆరాటమునకు కారణ మేమో తెలిసికొన దలంచితివేని వారి ననుసరించి వెనువెంట బోవుదమురమ్ము. ఈవిధి పురజనులా మార్గమున బోయి యొక 'న్యాయస్థానమును జేరిరి. అందులకు కారణ మేమో మీ కెరుంగగలిగితిరా? నాడు ప్రభాకరునిపై నారోపింపబడిన నేరము విచారింప బడునట. న్యాయస్థానమున నున్న ఆసనమున న్యాయాధి పతియును ఎదురుగ నున్న మేజాబల్ల కిరుప్రక్కల నమర్చబడియున్న ఆసనములపై న్యాయవాదులును, పురజనులకొరకు ప్రత్యేకముగ నియమింపబడిన ఆసనములపై పురజనులందఱును సుఖాసీనులై విచారణ సమాచారములు వినోదముగ విన కుతూహలపడుచు కూర్చుని యుండిరి. పోలీసువారి తరపున 1 వ సాక్షి మాణిక్యమును బోనుయందుంచి న్యాయాధిపతి యిట్లు ప్రశ్నించెను.

న్యా—నీపేరు?

మా—మద్దిల మాణిక్యము.

న్యా—కులము?

మా—భోగాలము.

న్యా—నీవీ ప్రభాకరునికి దువ్వటియిచ్చుట నిజమేనా?

మా—అవును.

న్యా—ఈతడు నిన్నుంచుకొనెనా ?

మా.—కొంతకాలము వరకుమాత్ర ముంచుకొనెను.

న్యా—నిన్ను విడచివేయుటకు కారణమేమి ?

మా—కమలను పెండ్లాడవలె నను తలంపుచేత.

న్యా—జూరత్ లాల్‌ను నీ వెఱుంగుదువా ?

మా—ఎఱుంగుదును.

కమల మాణిక్యమును కొన్ని ప్రశ్నలు అడుగుటకు అధికారుల యుత్తరువు పొంది యిటులామెను ప్రశ్నించుటకు ప్రారంభించెను.

క—వేశ్యలు వారి ప్రియుల విరోధులతో మాటాడు దురా ?

మా—వృత్తిధర్మము గనుక రహస్యముగ మాటాడు దుము.

క—అయిన మీరు దొంగపనులకు వెనుదీయరన్న మాట. నీ విదివరకు న్యాయస్థానములకు వచ్చి సాక్ష్యము లిచ్చుచుంటివా ?

మా—అవును.

క—బండ వీరన్ననుగాని, అహిరావణునిగాని, పటాల వీరన్ననుగాని నీవెఱుంగుదువా ?

మా—నా కెవరును తెలియదు.

క—నీవు నాడు నన్ను విజయనగరమున మాయా వతియను పేరుతో నుండి నన్ను వంచించి చంపనెంచితివేల?

మా—నావిరోధివై నన్ను ఓడించుటచేత.

క—సరియే నీసాక్ష్యమింకచాలు. మరిజరూరులేదు. అని పలికి అహిరావణుని న్యాయస్థానమునకు పిలిపించెను. పోలీసు వా రతనిని చూచి "ఓరీ! హంతకుడు మీగురువని నాడు దొమ్మరగూడెమున చెప్పియుంటివికదా? వాడెవడు?

అహి—ప్రభాకరుడు గారేనండి.

కమ—నీది విజయనగరము కదా? ప్రభాకరుని నీ కెటులు తెలుసును?

అహి—మాగురువగు బండవీరన్న గారివద్దకు ఈయన తరుచు వచ్చి వెళ్ళుచు ఈకూనీవిషయములో వారివలన సలహా లొందుచు పత్తేదారుని జయించుటకు నన్ను సాహాయ్యము కోరి తెచ్చిరి.

న్యా—సరియే నీసాక్ష్యము లింక చాలును వెళ్లుము.

అని పలికి బండ వీరన్నను న్యాయస్థానమునకు పిలిపించెను. పోలీసువా రతని జూచి నీవు ప్రభాకరు నెరుంగుదువా?

బం.వీ—ఎరుఁగుదును.

పో—కూనీవిషయమై నీకేమైనా దెలుసునా?

బం.వీ—ప్రభాకరు డాకూనీ తానే చేసితి ననియు నది తప్పించుకొనుటకు నన్ను సాహాయ్యము చేయుమనియు

కోరి ఎప్పటినంగతు లప్పుడే నా కెరుక చేసి నావలహా లొందు చుండెను.

క—నీకు ప్రభాకరునికి ఉత్తరప్రత్యుత్తరములు జరుగు చుండెనా ?

బం-వీ—అవసర ముండునపు డాతడు వ్రాయుచుం డెడు వాడు.

కమ—అట్టి ఉత్తరము లేమైనా యిప్పుడు చూపెట్ట గలవా ?

బం-వీ—ఎప్పటివి అప్పుడే చించివేయు చుండెడి వాడను.

కమ—జేబునుండు ఉత్తరము తీసి "ఈ ఉత్తరము నీ వెప్పుడైనా చూచియుంటివా ?

బం-వీ—హత్య జరిగినతరువాత ప్రభాకరుడు వ్రాసిన లేఖయే యిది.

కమ—ఇందుపై నాతనిసంతకము లేదుకదా? ప్రభా కరుడు వ్రాసెనని యెట్టుల నిర్ణయించితివి ?

బం-వీ—అందుపై నాతనివేలుముద్రచూచి గ్రహిం చితిని. సరియే నీసాక్ష్యము చాలును. వెళ్ళుమని పటాల వీర స్వను న్యాయస్థానమునకు రక్షించెను.

క—నీ పెట్టెను ఎవరికవిస్మృతివో యిప్పుడైనా చెప్పె దవా ? లేదా ?

వీ—ప్రభాకరునికే అమ్మితిని.

క—అందులకు నిదర్శన మేమైన గలదా?

వీ—ఆయన కిచ్చిన బిల్లుకాపీ యిదుగో.

క—అది అందుకొని ఈకాగితముపైన "జూ" అను నక్షరము వ్రాసి కొట్టివేయ బడినదేమి?

వీ—జూలై నెల అని వ్రాయబోయి అదుగున వ్రాయ వచ్చునని కొట్టివేసితిని.

క—ఏప్రిల్ నెలలో వ్రాసిన బిల్లుగదా ఇది జూలై అని ఏల వ్రాయబోతివి?

వీ—ఏమో నా కాసంగతులు జ్ఞాపకము లేదు.

క—సరియే నీసాక్ష్యము లింక చాలును. బయటకు బొమ్ము. ప్రక్క నిలబడియున్న ప్రభాకరుని చూచి పోలీసు వారు "నీవు డాక్టరుపరీక్ష ప్యాసైతివా?"

ప్ర—అవును.

పో—హైడ్రోసైనిక్ ఏసిడ్ బుడ్డి నీగదిలో వున్నదా?

ప్రభా—ఉన్నది. కాని నాకెటులవచ్చినదో తెలియదు.

పో—నీ పెట్టెలోగల ఉత్తరములు మాణిక్యము వ్రాసినవేనా?

ప్ర—నాకు తెలియ.

పో—మేము అడిగినప్పుడు పెట్టెతాళము లేల యియ్యలేదు?

ప్ర—అవి పోవుటచేత.

పోలీ—నీవు హంతకుడవు కావనుటకు సాక్షులెవరైనా వున్నారా?

ప్ర—నేను హత్య చేయలేదు. అందులకు ఆదైవమే సాక్షి.

పో—నీవు నాడు జయిలునుండి ఏల పారిపోయితివి?

ప్ర—తలుపు తెరచి ఎవర్తో పొమ్మనుటచేతను పోయిన యెడల నిజము నిలకడపైన తెలియునను నమ్మకము చేతను అట్లు పారిపోతిని.

పో—నాడు నీవు రామన్‌లాల్‌ను జంపి అక్కడ పట్టు పడితివా?

ప్ర—నే చంపలేదు. ఎవరో యిద్దరు దుర్మార్గులు ఆయనను చంపుచుండ నేను రక్షింప వెళ్ళితిని. ఇంతలో వారు పారిపోయిరి. అందరు వచ్చువరకి నే నచ్చట నుండుటచే నేనే హంతకుడ నని నన్ను పట్టుకొనిరి.

పోలీ—సరియే నీకు మేలుచేసిన కమలను మాయచేసి మాయామహాలునుండి ఏల పారిపోతివి?

ప్ర—ఆ మాయా మహాలునందుగల మాయలు నే నెఱుంగక నొకదినాట నొక్క పాతాళమున బడిపోతిని. అది

కమల తెలుసుకొనజాలక ఆమెను మాయచేసి మాయమైతి నని ఆమె అనుమానించినది. తుదకు రక్షకభటులె నన్నా పాతాళమునుండి రక్షించిరి.

పోలీ—సరియే నిన్నింక అడుగవలసినది లేదు. వెళ్లుమనిరి.

న్యాయాధిపతి కమలను పోలీసువారిని బిలిచి "సాక్ష్యములు వినుట పూర్తియైనది. ఇక మీమీ అభిప్రాయములు వెల్లడించినయెడల అవి విని తీర్పు చెప్పెదను. అని న్యాయాధిపతి చెప్పెను.

పిదప కమల యిటుల తనయభిప్రాయము వెల్లడించ ప్రారంభించెను.

న్యాయాధిపా !

ముద్దాయిపై నెన్నిసాక్ష్యములు వచ్చినను అవియన్నియు అసత్యసాక్ష్యములనియు, యితడు హంతకుడు కాడనియు నాకు తోచుచున్నది. ఏలయన ప్రభాకరుడే హంతకుడైనయెడల తాను డాక్టరప్పటచేత హత్యచేయుటకు విష ప్రయోగము చేయడు. ఒకవేళ అట్లుచేసినను ఆ విషముబుడ్డి తన యింటనే అజాగ్రత్తగా నుంచుకొనడు. శవమును పంపిన పెట్టెలోగల దుప్పటి మాణిక్యమునది యగుటచే ఆమెకు తనకు సంబంధ మున్నటులు తెలియజేయు వుత్తరములు తన పెట్టెయందు ఎన్నడును ఉంచుకొనడు. హత్యజరిగిన

పూరులోనే కొన్ని పెట్టి శవముంచుట కుపయోగించుడు. బండ వీరన్నకు వ్రాసిన పత్రములో గల వ్రేలిముద్ర ప్రభాకరు నిది కాకపోవుటచేత అతడు హంతకుడు కాడనుటకు అది యొక నిదర్శనము. రామన్‌లాల్‌ను ప్రభాకరుడే నిజముగ జంపినయెడల అతడక్కడనుండి పారిపోయియే యుండును. మాయామహాలున నన్ను మాయచేసి పోకపోవుటబట్టియే రక్షకభటులకు పాతాళగృహమున పడియుండి దొరికెను ఇంక సాక్షులన్ననో లంచమునకు మంచమువేయు వేశ్యమాట లెక్కయే లేదు తక్కినవార లందరు దొంగలు. వారు చెప్పినమాటలైనను సందర్భముగ లేవు. వీరందరు నేదియో యొక కారణమువలన ప్రభాకరునిపై యిటు లబద్ధసాక్ష్యము లిచ్చిరనియు, ప్రభాకరుడు హంతకుడు కా" డనియు నుడివెను. పిదప పోలీసుకోశాధ్యక్షుడు లేచి,

"ప్రభాకరుడు హంతకుడు కా డని పత్తేదారిణియగు కమల సమర్థించుటకు కారణము లేకపోలేదు. ఆమె కతనిపై కడు ప్రేమ. ప్రభాకరుడు వారియింటనె పెరిగి పెద్దయయిన వాడు. హత్యాపరికరము లతనియింట నుండుటచే అతడు హంతకుడు కా డని చెప్పుటకు సాధ్యము లేదు. ఒకతప్పు చేసినవాడు అది కప్పుకొన అనేక తప్పులు చేయును. కాబట్టి యితడే హంతకుడు." అని పలికెను. ప్రభాకరుడు, సాక్షులు అందరు యథావిధి జయిలునం దుంచబడిరి. న్యాయాధిపతి

యీసంగతు లన్నివిని తీర్పు చెప్పబోవుచుండ "ఆగండోయి అన్నయ్యలు, పిలవని పేరంటకములాగ నేనొచ్చిని వున్నాను; సాక్షిం" అని కేకలు వేయుచు నొకవ్యక్తి వచ్చి న్యాయస్థానమున నిలచెను.

న్యాయాధిపతి వానిని జూచే యిటులడిగెను.

న్యా—నీ వెవరు?

వ్య—సాక్ష్యము చెప్పవచ్చిన సాక్షిని.

పోలీసువా రతనిని జూచి "అయ్యా! యితడు పిచ్చివాడు. ఇతని సాక్ష్యము మనకు జరూరులేదు" అని పలికెను.

"ఆ! మీకు నిజము చెప్పువా రందఱు పిచ్చివారివలెనే కనబడుచుందురు. మన మిరువురము పిచ్చివారలమే. నీకు ధనపిచ్చి, నాకు నిజపిచ్చి; అయ్యా! నేను మిమ్ము పాటి చేయను. నిజమును చెప్పవలసి వచ్చినవుడు ఒకరిలెక్కనాకేమి నాకీ హత్యాసమాచార మంతయు మొదటినుండి దెలిసియుండుటచే నే వెర్రివానివలె తిరుగుచు ప్రజలకల్లే భ్రమకలిగించుచు న్యాయా న్యాయ పరిశీలన చేయుచు తిరుగుచుంటిని. ఈమద్దిలమాణిక్యమును ప్రభాకరు డుంచుకొనలేదు. రామన్ లాల్ కుమారుడు జూరత్ లాల్ యొక్క యుంవుడుకత్తె. వారిరువురు మాయ వేషముతో మాయా మహలున వసించి ధనమార్జించి వెచ్చించుచుండిరి. అక్కడ మాయావతి పట్టుపడిన

పిదప ధనముకొఱకు యితడు తండ్రిని చంపెను. ఆ సమయమున వీరిని బట్టుకొనవచ్చి ప్రభాకరు డక్కడ దొరికిపోయెను. వీరు పారిపోవుచుండ నే నడ్డగించి పట్టుకొనబోవ నన్ను తప్పించుకొని పారిపోయిరి. అప్పుడు వారి కోటుమాత్రము నాచే జిక్కినది. ఇదిగో నిదర్శనము తీసుకొనివచ్చితి. నేనెవరో మీరు గ్రహించవలెనని యున్న నిదిగో తెలిసికొనుడు. అని ముఖమునగల ముసుగును నెత్తిపై గల విగ్గునుతీసివేసెను. వారందఱాతనిని జూచి హరిప్రసాదుబాబని తెలుసుకొని అపరిమితాశ్చర్యము నొందిరి. కమల అపరిమితానందముతో వెళ్ళి తండ్రిని కౌగిలించుకొనెను. న్యాయాధిపతి నిశ్చేష్టుడై చూచుచుండెను. "మాకేకే నతివినోదముగ గన్పట్టుచున్నది. ఏమైనను తీర్పుచెప్పుటకు చాలా రాత్రి కావచ్చినది. రాత్రి యోచించి రేపు తప్పక తీర్పుచెప్పెదను" అని సభ చాలించెను. పిదప నెవరిండ్లకు వారు వెళ్ళిరి.

---

## ఇరువదియొకటవ ప్రకరణము.

---

### "తీర్పు"

మరుచటి యుదయమున న్యాయస్థానమున న్యాయాధిపతియు, న్యాయవాదులును, కమలయు, పోలీసు ఉద్యోగియులు, హరిప్రసాదుబాబు మొదలగు అనేక పురజనులు

వచ్చిచేరిరి. ఈసమయమున కొందఱు రక్షకభటులు ఒక శవ మును నీడ్చుకొనివచ్చి న్యాయస్థానమునయుంచి "అయ్యా! రాత్రి మాణిక్యము నుంచబడినగదికి సొరంగము చేసి ఆమె నీ జూరత్ లాల్ తప్పింపబోవుచుండ మన చౌకీదారు లదిజూచి యితని నాప వారిపై నితడు పిస్తోలు పేల్చెను. వారు కూడ యితనిని జయింప పిస్తోలుతో కొట్టిరి. మాణిక్యమును పట్టు కొని తిరుగ బంధించిరి. ఇత డాగాయముచే బాధపడుచు చావసిద్ధముగనుండి చెప్పిన ప్రమాణవాఙ్మూల మిది. అత డిందుపై సంతకముకూడ చేసి మృతినొందెను." అని చెప్పి న్యాయాధిపతి కొకకాగిత మందజేసెను.

న్యాయాధిపతి అక్కడ సభాసదుల కది యిటుల చదివి వినిపించెను.

"నేను రామనాథము కుమారుడనగు జూరత్ లాల్ ను. నా కీ కమలపై చిన్ననాటినుండి కడుప్రేమ. ఆమెకు నాపైన ప్రేమ లేదని నేనెరుంగుదును. అందుల కా ప్రభాకరుడే కార ణమని నాయూహ. వానిని నొదల్చినగాని న న్నామె పెండ్లాడ దని నే నూహించితిని. ఎంతప్రయత్నించినను కమలా ప్రభా కరుల విడదీయుట నాకు సాధ్యపడలేదు. చిన్ననాటినుండి మాణిక్యము నావుంపుడుకత్తె. మరాలోచనల కది పుట్టినిల్లు. దుష్టులందఱు ఆమెకు స్నేహితులు. నాకొకనా డామెయే కమలతల్లిని చంపి ఆనేర మితనిపై పెట్టు ఉపాయము చెప్పి

నది. కమలగల్లి ఒకనాడు మాయింటికి వచ్చి తిరుగా బోవు చుండ నేనామెను సాగనంప బయలుదేరి మాయచేసి మాణిక్య మింటికి తీసుకొని వచ్చితిని. అక్కడ నిమ్మప్రయోగముచే నామెను వంపి యొక పెట్టెయందుంచి దుప్పటికప్పి పెట్టెకు తాళమువేసి ఆపెట్టెను గోదావరీ స్టేషను ప్లాటుఫారముపైన విడచి వచ్చితిని. హరిప్రసాదు బాబింటగల నరసియను దాసి మూలమున ప్రభాకరుని పెట్టెయం దుత్తరములు అలమరలో విషముబుడ్డిని నామాణిక్యమే పెట్టించినది. తదుపరి మాణి క్యమే యీమాయానాటక మంతయు నాడించినది. అహిరావ ణుడు, బండ పీరన్న, పటాల పీరన్న మొదలగు వారందఱు మాణిక్యము గ్యాంగులోనివారలే. ధనముకొరకాశించి తండ్రి నిచంపుకొని పారిపోవుచుండ నన్నొక వెర్రివాడడ్డుకొన నే విడుల్చుకొని పారిపోవ నాకోటు వానిచే చిక్కినది. నే హత్యా పరాధుడనుగనుక నే నెన్నిమాయలు చేసి తప్పించుకొన జూచి నను భగవంతుడే నన్ను శిక్షించెను. అన్యాయముగా ఆప్రభా కరుని చంపుట నాకిష్టములేక నాప్రాణావశిష్టసమయమున యీ నిజసమాచారము తెలియజేసితిని. ఇట్లు,

జూరత్ లాల్"

సభవారీసమాచారము విని అత్యానందము నొందిరి. ప్రభాకరుని సత్యసంధతకు మెచ్చుకొని కమల పట్టుదలను శ్లాఘించి వెర్రివేషధారి యుక్తికి సంతసించిరి.

ఈ సమాచారము లారసిన న్యాయాధిపతి తన తీర్పు యిటుల చదువ ప్రారంభించెను.

ప్రభాకరుడు నేరస్థుడని పోలీసువా రతనిపై మోపిన కూనీకేసులో నేరస్థుడని వారు చూపిన ఆధరువులన్నియు తాత్కాలిక నిదర్శనము లగుటచేత మాణిక్యముయొక్క సాక్ష్యము నమ్మదగినది కాకపోవుటయే కాక ఆమెయే ఈ హత్యకు కారకురాలని అనేక నిదర్శనము లగుపడుటవలనను జూరత్ లాల్ తన మరణవాఙ్మూలమునగూడ నీసంగతి చెప్పుటచేతను యీామెయే హత్యకు కారకురాలని దృఢపరచి యీామెకు యావజ్జీవము ద్వీపాంతరవాసశిక్ష విధించితిననియు......

పటాలవీరన్న యీామె గుంపులోవాడే యగుటచేతను కమలాకరుని అన్యాయముగ చంపజూచుటచేతను ప్రభాకరునిపై అబద్ధపుసాక్ష్యము చెప్పియుండుటచేతను వాని కైదు సంవత్సరములు కఠినశిక్ష విధించితిననియు.........

అహిరావణుడు మొదలగు నొమ్మరులు వీరన్నమాటపై దుర్మార్గములు చేయ ప్రారంభించినందుకు ఆరుసంవత్సరములు కఠినశిక్ష విధించితిననియు............

బండవీరన్న వీరందరికి ఆదివిరాటు వంటివాడు అనియు, ఘోరాపరాధము లెన్నియో చేసెడు దుర్మార్గుడనియు, హత్యాపరాధులకు ఆధారభూతుడనియు నిశ్చయించి వానికి పది సంవత్సరములు కఠినశిక్ష విధించితిననియు.........

కమల ఆడదైనను కష్టపరంపరలకోర్చి పులులవంటి దొంగలతో కయ్యమున కియ్యకొని న్యాయోద్ధారణకు పడరాని పాట్లుపడి వెయ్యరాని వేషములువేసి తాను మోహించిన ప్రభాకరుని కాపదోద్ధారిణియై పట్టినపట్టు విడువక న్యాయము గ్రహించి ప్రభాకరుడు హంతకుడు కాడని సమర్థించుట కామె చెప్పిన నిదర్శనములు కడు సమంజసముగా నుండుట చేతను నే నామె మాటలు నమ్మి ఆమెకడ కార్యదీక్షా పరతంత్రయని శ్లాఘించి యీమె కీపని మానినను ఉచితవేతన మిచ్చుటయేగాక యీమె శక్తిసామర్థ్యముల కానందించి యీమె తన పనియందు జూపిన శరవేగమునకు మెచ్చుకొని "పంజాబుమెయిల్" అను బిరుదు నొసంగితిని. వెర్రివేషధారియైన హరిప్రసాదుబాబు యితరులకు తెలియకుండ కుమారికు సహాయుడగుచు నిజమగు హంతకుని గ్రహించి నిదర్శనములు చూపినందులకు ఆయన కిదివరకు యిచ్చెడి వుచితవేతనము రెట్టింపు యీయుటకును వేషభూషణ యని బిరుదీయుటకును తొలినుండియు జూరత్ లాలే అనేక కుట్రలుచేసి హత్యగావించినను తుదకు అతడు సత్యము వచించినందులకు ఆతని ఆత్మకు శాంతి కలుగుటకు ఆతని ఆస్తియంతయు వానిపేరిట ధర్మకార్యములు చేయుచుండుటకును.........

సద్గుణవంతుడును, సత్యశీలుడును, విశ్వాసపాత్రుడును ప్రభాకరునిపై మోపబడిన హత్యాపరాధము పైనచెప్పబడిన

కారణములచే అసత్యమనియు నితడు నిరపరాధియనియు నిశ్చయించి కేసు రద్దుపరచి యిత డతిగుణవంతుడని శ్లాఘించుటయే కాక యితని కీగ్రామమున జిల్లానర్జను పని యిచ్చుటకు హుకుం జారీచేయుచున్నాననియు మరియు రక్షకభటు డయ్యు హంతకులకు సాయముచేసి మాణిక్యమున కొక దొంగయుత్తరము తెచ్చి యిచ్చుటకు దొంగకు సాయముచేసిన 333వ నెంబరు రక్షకభటునకు పనితీసివేయుటయేకాక మూడు సంవత్సరములు కఠినశిక్ష విధించితి ననియు............

హరిప్రసాదుబాబు గారింట బానిస్తైయుండియు నరసి, స్వామిద్రోహము చేసి మాణిక్యమునకు తోడ్పడినందులకు నామెకు రెండు సంవత్సరములు కఠినశిక్ష విధించితిననియు యిందుమూలముగా తీర్పుయిచ్చుచున్నాను.

---

## ఇరువదిరెండవ ప్రకరణము.

---

### "పరిణయము"

మాసములలో నెల్ల మాఘమాసము కడు సమంజసమగునది. శ్రేష్ఠమైనది. అనేక వివాహాది శుభకార్యము లామాసముననే యెక్కువగ జరుగుచుండును. ఏలనన శీతోష్ణము లామాసముననే సమముగా నుండును. సర్వసామాన్య తినుబండారములును ఆమాసముననే మితవ్యయమునకు లభించును.

జల మతి సమృద్ధిగ నుండును. వర్షాటంకము లుండవు. ఎండ గాడుపులకు జడియనక్కరలేదు. గాన మన హరిప్రసాద్ గారింట గూడ కమలాప్రభాకరుల వివాహ ప్రయత్నములు జరుగుచున్నవి. వారింటినిండను పచ్చని తోరణములతో నున్న పందిరు లమర్చబడియున్నవి. మిత్ర, బంధు, వర్గములందఱు వచ్చియుండుటచే గృహ మతి కలకలలాడుచున్నది. నాడే వివాహదిన మగుటచే బేండు, సానాయి, మొదలగు మంగళ వాయిద్యము లతి శుభసూచకముగ మ్రోగుచున్నవి. ఒక దిశ వేశ్యకాంత లేవో పాటలు పాడుచు తెయితక్క లాడుచుండిరి. నవనాగరిక శిఖామణు లగు యువకులా కాంతల పాదముల వద్దాశీనులై యుండి కాంతాపింజోకానందమున మునింగి నోల లాడుచుండిరి. ఆకాంతల యభినయాది వర్ణనలన్నియు వారిని గూర్చియే యని భ్రమసి ప్రతివారును నువ్విళ్ళూరుచు, తమ చెంతనున్న కానుక లర్పించు చుండిరి. మూఢజనానందము కొఱకు గావలయు నొకచోట బొబ్బిలిపాటకులు పాడుచుండిరి. ఒకచోట బొమ్మలాటకు, మరియొకచోట భాగవతమునకు పందిరులు వేయబడుచున్నవి. ధనవంతుడు ఆపదనుండితప్పింప బడి ఆనందముగ వివాహము చేయుచున్నాడు. సంభావనమేమి యిచ్చునో యని గుంపులు గుంపులుగా చేరియున్న బ్రాహ్మణులు తమలో తాము ప్రసంగించు చుండిరి. చదువరులారా! వీటన్నిటిమాట కేమిగాని హరిప్రసాదు బాబుగారింట కమలా ప్రభాకరుల కల్యాణముకొఱకు, నిర్మింపబడిన కల్యాణమంట

పము మిగుల వర్ణనాతీతముగ నున్నది దానియందెటు చూచినను, ముద్దులు మూటగట్టునటులు ముత్తెంపుసరులు వ్రేలాడి జీరాడుచున్నవి. వజ్రవైడూర్య రత్న భేదము లమర్చబడి యున్నవో యనునటు లామంటపమంతటియందు పంచ రంగుల చిన్న చిన్న గాజుబుడ్లమర్చబడి యున్నవి. చమ్కీవేయ బడిన ముఖమల్ చాందిని కట్టబడియున్నది. చుట్టును జరీ జాలరు వ్రేలాడగట్టబడి నిక్కముగ హృదయాకర్షణమై సర్వ జనానందకరమై యున్నది. సన్నని స్తంభములపై నిర్మింపబడిన యాపందిరిచుట్టును విలువగుటద్దము లమర్చబడి యున్నవి. రంగు రంగులపూలసజ్జ లందందు వ్రేలాడదీయబడి యున్నవి. విద్యుచ్ఛక్తి ప్రభావమున వీచువీవనలు. నిలువంకలగల సభా సదుల గౌరవింప పన్నీరుజిలుకు వింతవింతయంత్రము లమర్చ బడియున్నవి. మహామహులగు మహాశయు లనేకమంది యామందిర మలంకరించిరి. కమలాప్రభాకరు లరుదెంచినపిదప కులాచారపద్ధతి ననుసరించి శాస్త్రీయముగ జరుగవలసిన క్రియలీవలనే జరిగియుండుటచే నవనాగరికులగు తమమిత్రులు, బంధుగులు, పురజనులు మొదలగువారి కగుపరుప నాదంపతు లను హార్మోనియప్రసాదుబా బచ్చుటకు దెచ్చి వారికొఱకు నియ మింపబడిన కళ్యాణమంటపమున నాసీనులజేసిరి. కమలాప్రభా కరులదిలకించి అందుగల స్త్రీపురుషులందఱమందానందమాన సులై, సంతోషాతిరేకమున మెలంగుచుండిరి. అంత మన

హరిప్రసాదు జానభానదులకు నమస్కరించి, "పరమేశ్వరుం డగు నీశ్వరునివిలాసంబు కడు ప్రశంసనీయము. నిన్న మొన్నటి వఱకు కీకమలాప్రభాకరులు సహితముగ నే నొందిన యిడుములు మీ రెఱుంగనివి గావు. భక్తావళోకియగు నాపరాత్పరుని కరుణాకటాక్షవీక్షణంబున నిప్పటికి మాకు శుభోదయమాయెనని, తమ కెరుకజేయుట కితి ఆనందించు చున్నాను. పాప మీ ప్రభాకరమహాశయుడు మాకుటుంబమునజేరి సుఖంచుటకుబదులు లోకాపవాదములపాలై సర్వజన విరోధియై పొందిన కష్టపరంపర లనంతములు గాని ధర్మమే జయమను నార్యోక్తి ననుసరించి యిప్పటికితమజయప్రసాదుడై మనమెప్పు పొందెను. ఇతని శత్రువులుపన్నిండు వ్యూహముల నీకముల తన బుద్ధికుశలత నుపయోగించి భేదించుచుండెను. ఆసందర్భములం దీప్రభాకరవీరాగ్రణి తన యమానుషపరాక్రమాతిరేకమున శత్రువులజయించి యీమెకు సహాయపడుచుండెను. తుట్టతుద కెటులో జయమందినసంగతి మీ రెఱుంగుదురు. తొలిదొలుతనుండి యీకమలాప్రభాకరులకు వివాహము చేయవలయునని మదీయముఖ్యాశయము గాని మూర్ఖచిత్తయగు నాభార్యయాటంకమువలన జాల యొనరింప వలసి వచ్చెను. ఇంతలో నాభార్య హత్యగావింప బడెను ఆనేరమితనిపై మోపబడుటంజేసి యింతవరకీ కాలవిలంబమాయెనది. ఇప్పటికాపరమేశ్వరుని కరుణాకటాక్షమున యీ యువకుల పరిణయ మాచరింపగలిగితిని. ఈసందర్భమున దయచేసిన

తా మెల్లరు వధూవరుల నాశీర్వదించి మదర్పితచందనతాంబూ
లాది రసవర్గములగైకొని నన్నానందింపజేయ ప్రార్థితులు"
అని పలికి హరిప్రసాదుబాబు తన యాసనమునం దాసీను
డయ్యెను. సభాసదు లపరిమితానందభరితులై వధూవరుల
నాశీర్వదించి తాంబూలాదిరసవర్గముల స్వీకరించి గృహాభి
ముఖులై పయనమయిరి.

---

## ఇరువదిమూడవ ప్రకరణము.

---

### "వినోదవనము"

సంధ్యా సమయమున సూర్యాస్తమయమున భానుని
బంగారుకిరణములు వినోదమున గల వృక్షములపై బడి వింత
సొగ సొనగూర్చుచున్నవి. వనమందలి ప్రతిభాగమందును
గల పూలమొక్కలు వికసించిన పుష్పములచే నిండి విరా
జిల్లుచుండెను. ఆవనమధ్యమున నొక దివ్యభవనము గలదు.
ఆభవనమంతయు నల్లిబిల్లిగ నల్లుకొని చుట్టుకొని యున్న లత
లతివింతగ నున్నవి. ఆమాలతీమల్లి పొదలచాయను నొక
సోఫాపై కమల ఆసీనయయి యుండెను. నేటికి మనశ్శాంతి
కలుగుటచే మన కథానాయకి మనోహరముగ శృంగారించు
కొని యుండెను. కమల నేడు ధరించినవి చంకీమయమై
యున్న పట్టుదుస్తులు. ఆమెకర్ణముర కలంకరించిన లోలకుల

తళుకు ఆమె చెక్కిళ్ళులకాంతిని మించజాలక సిగ్గున పోవదలంచి కట్టుబడుటచే పోజాలక నిటునటు నూగులాడుచు కను రమణీయము గనున్నవి. కంఠమునందుగల హారముల నిగనిగలు చూపరుల కనులు మిఱుమిట్లు గొల్పుచున్నవి. పాదములకు ధరించిన ముఖమల్ పాదరక్షలపై బడియున్న పాయిజేబుగొలుసులతి నొయ్యార మొనగూర్చుచున్నవి. ఇట్టి శృంగారవిలాసినియగు కమల తన మనోహరుని దలచి "ప్రభాకరా! నీ వెచ్చటనుండి జాల మొనర్చు చుంటివి. ఏపరిస్థితులందుంటివి. నీవంటి రూపసిని, వీరుని, శౌర్యఘనుని, ధైర్యశాలిని, నవకోమల శరీరుని యేవనిత విడచియుండగలుగును. నాథా! నీ వియోగానలమున నే నెంత అలసట జెందుచుంటినో తలంచితివా? కమల తన చెలికత్తియలతో యీ వినోదవనమున నాటపాటలమునింగి వినోదించుచున్న దనుకొంటివేమోకాని ప్రియా! అట్లుకాదు. రేయింబవళ్లు నీ సుందర వదనారవింద సందర్శనమే నీ సుక్షత్రియ తేజమే ఎదుట సాక్షాత్కరించి నన్ను న్మాదినిని గావించుచున్నది. ప్రియా! యింతజాగు సేయ నీ మనసెట్లొప్పెనది. నీవింత కఠినహృదయుడవై తివేల ? నాథా! నీ వెరుంగవుగాని నీ నామస్మరణ జేయుచు పరితపించుచుంటిని. నాహృదయపేటికయందు నీఛాయాప్రతిమ భద్రపరచియుంటిని. అవిగో ఆవినీలకుంతలములు, శృంగార శోభితలోచనములు, సర్వమును పొడగట్టుచున్నవి. నన్ను నీదాసినిగా దలంపుము.

స్వీకరింపుము. సుఖింపుము. నాకు నీయెడగల భక్తితో ఆ పరమేశ్వరుని పూజించిన, సేవించిన యీపాటి కా కరుణాళుడు మోక్ష మొసంగియుండును” అని యేమేమో అనుకొనుచు కలవరపడి ఒకసారి నలుదిశలు పరికించి ఆశాభంగ మొందిన దానివలె విచారమొంది, నిట్టూర్పు విడచి, నలుదిశల పన్నా రొనర్చి ఆ సమీపముననున్న వీణదీసి వాయించుచు “నాథా! యిది న్యాయమా?” అని పాడుచుండెను.

ఈ సమయమున ప్రభాకరు డరుదెంచి, చెట్టుచాటున నిలచి శ్రవణానందమగు కమలగానామృతమును గ్రోలుచు తన్మయత్వము నొందుచుండెను. ప్రేమతరంగము లాపుకొన జాలక కమలప్రక్కను జేరి నక్కునజేర్చి చెక్కిలినొక్కి ముద్దాడి పట్టరానిమోహము సైరింపజాలక యాతలోదరిని మఱల మఱల ముద్దిడజొచ్చెను. ఆమె నొకసారి తనకౌగిట నొక్కి గాఢాలింగన మొనర్చవలయు నను కోరిక గలదుగాని ఆపె విదలించుకొని గిరుక్కున తిరిగి ముఖ మటుత్రిప్పి నిలువబడెను.

అంత ప్రభాకరుండు ఆ మందగమనను సమీపించి కరంబు పట్టుకొని సోఫాపై కూర్చుండజేసి తానా ప్రక్కనాసీనుడై ముఖముపై మూగిన ముంగురులు “దిద్దుచు ప్రేయసీ! ఆగ్రహించితివా?”

క—ఆగ్రహించుట కేమి మీ రనుగ్రహింప లేదు కదా?

ప్ర—అటులనెదవేల ?

క—మరి, బహుమతియేది ?

ప్ర—ఏమి కావలయును ?

క—మీా కెరుంగరా ?

ప్ర—చెప్పకూడదా ?

క—చెప్పిన చెల్లించెదరా ?

ప్ర—చెల్లింపకున్న తప్పునా ?

"పోనీ వద్దు అంత బలవంతమేల" అని కమల గిర్కున తిరిగి పరుగిడి సమీాపమునగల శయనగృహము చేరెను బ్రతిమాలుచు ప్రభాకరు డామె ననుసరించెను. ఇంతలో గొప్ప గాలిసాగి శయనద్వారము తలుపులు మూసెను. ఇక తెలిసికొనఁ నేమియు లేదని మా చదువరుల కెరుకయని యెరింగి నేన సెలవు గైకొనుచుంటిని.

సమాప్తి

శ్రీ కొండపల్లి ప్రెస్, రాజమండ్రి.

# నవలలు

| | రు. | అ. |
|---|---|---|
| మొదల్లేదు | 0 | 8 |
| అనాథశరణాలయం | 0 | 6 |
| పిచ్చిపుల్లయ్య | 0 | 6 |
| గర్భవతి | 0 | 6 |
| వ్యభిచారిణి | 0 | 6 |
| హోయ్ హోయ్ | 0 | 6 |
| పూజామందిరము | 0 | 6 |
| కులట | 0 | 6 |
| పంతులమ్మ | 0 | 8 |
| మార్కెట్ క్వీన్ | 0 | 6 |
| జాలీలాడీ | 0 | 6 |
| గుడ్ బై | 0 | 6 |
| అవినీతి | 0 | 6 |
| వసంతకుడు | 0 | 6 |
| సేవాంతకుడు | 0 | 6 |
| గృహలక్ష్మి | 0 | 8 |
| వరుడు కావాలి | 0 | 6 |
| ఉరి స్తంభము | 0 | 6 |
| త్రాచుపగ | 0 | 6 |
| మోటుసరసము | 0 | 6 |
| మేజువాణి | 0 | 8 |
| వలతప్పు | 0 | 6 |
| మా ఆవిడ | 0 | 6 |
| రాత్రిరాణి | 0 | 8 |
| **ఇతర కవుల నవలలు** | | |
| క్రిస్టియన్ డాక్టర్స్ | 0 | 8 |

| | | రు. | అ. |
|---|---|---|---|
| సానిహృదయము | | 0 | 8 |
| వంటలక్క | | 0 | 6 |
| సెక్స్ షాక్ | | 0 | 6 |
| సినీఆర్టిస్టు | | 0 | 6 |
| యంగ్ విడో | | 0 | 6 |
| ఫిలిం డైరెక్టర్ | | 0 | 6 |
| ఫాదర్ యిండియా | 1 భా | 0 | 6 |
| డిట్టో | 2 భా | 0 | 6 |
| పొడరక్ లేడి | | 0 | 6 |
| పన్నేళ్ళపిల్ల | | 0 | 6 |
| లోకాశ్రీరామాయణం | | 0 | 8 |
| రాజేశ్వరి బి. ఏ | | 0 | 8 |
| ప్రేమోపాసి | | 0 | 6 |
| దేవకన్య | | 0 | 6 |
| టాకీబాము | | 0 | 6 |
| పతితల్లి | | 0 | 5 |
| మమకారం | | 0 | 6 |
| ఇల్లాలు ఉసురు | | 0 | 6 |
| జమీందారిణి | | 0 | 6 |
| సంప్రదుకత్తె | | 0 | 6 |
| కమ్మపిల్ల | | 0 | 6 |
| ఊసుపోక | | 0 | 6 |
| భర్తలేనిభార్య | | 0 | 6 |
| తోలిసముద్ర | | 0 | 6 |
| మలిసముద్ర | | 0 | 6 |
| పాషాణము | | 0 | 8 |
| సైసన్యసుగడు | | 0 | 8 |

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి

## డిటెక్టివ్ నవలలు

| | | రు | అ |
|---|---|---|---|
| బంగారుభరిణె | 1 వ భా॥ | 1 | 8 |
| డిటో | 2 వ భా॥ | 1 | 8 |
| సుడిగాలి | 1 వ భా॥ | 1 | 8 |
| డిటో | 2 వ భా॥ | 1 | 8 |
| శిశుహత్య | 1 వ భా॥ | 1 | 0 |
| డిటో | 2 వ భా॥ | 1 | 0 |
| డిటో | 3 వ భా॥ | 1 | 0 |
| మంత్రగబ్బ | 1 వ భా॥ | 1 | 0 |
| డిటో | 2 వ భా॥ | 2 | 0 |
| యమదూత | | 1 | 0 |
| భయంకరనారీపిశాచి | | 0 | 12 |
| ప్రతాప దౌర్జన్యము | | 0 | 12 |
| భయంకర చోరాగ్రేసర చక్రవర్తి | | 0 | 12 |
| పరిశోధన | | 0 | 12 |
| నీవేనా ? | | 0 | 12 |
| అఘోరి | | 0 | 12 |
| అగ్గిరాముడు | | 0 | 12 |
| బలేపెండ్లి | | 0 | 12 |
| సాహసికుడు | | 0 | 12 |

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.